✠

శ్రీ సర్వేశ్వరాయ నమః.

# THE DIFFERENCE BETWEEN THE TEMPORAL & THE ETERNAL.

# అనిత్యనిత్య వ్యత్యాసము.

ఇది

పూర్వమున ఈ దేశమునకు సత్యవేదమును బోధింపవచ్చిన
గురువులలో నొకరిచేత రచింపబడెను.



నెల్లూరు
అర్చ్య. జ్యాన్స్నసు ముద్రాక్షరశాలలో ముద్రించి
ప్రచురింపబడియె.

ST. JOHN'S PRESS, NELLORE.
1953.

జే. మ. జో.

# అనిత్యానిత్య వ్యత్యాసము.

## వివేకము.

సృష్టింపను పాలింపను లయము చేయను సర్వశక్తుడైన దేవుడు మోక్షభాగ్యమను పరమగతిని మనుష్యుని కీయ చిత్తగించి యున్నాడు. మరియు మనుష్యు డటువంటి పరమగతిని సులభముగా పొందునట్లు ప్రపంచ వస్తువుల సందు లోక యత్న సహాయముగా నుండ కట్టడ చేసెను. ఇట్లుండగా మనుష్యుడు లోకసుఖములను పరమకర్త కట్టడ చేసిన నీతిన్యాయములచొప్పున ననుభవింపక, క్రమము తప్పి యవియే తనకు పరమగతి యని భ్రమించి యాశాపాశముచే వానిని వదలని పట్టుదలతో కోరి తన రక్షణమును పోగొట్టుకొనుచున్నాడు. అదియునుగాక యీ ప్రపంచవస్తువులు మన మేలునకు కలిగింపబడి యున్నను, మనుష్యు డక్రమపరుడై వానిని దుర్వినియోగించి పాపములలో బడి తనకు దానే నరకాజ్ఞ ప్రాప్తింప జేసికొనుచున్నాడు. తాను కొన్ని దినములె సుఖింపనగు అనిత్యమైన యీ లోకపు మేలులను నమ్మి తనకుగాను కలిగింపబడియుండు నిత్య మోక్షరాజ్యమును బోగొట్టుకొనుటయేగాక, యంతములేని నరకాజ్ఞలకు ప్రాప్తుడగుచున్నాడు. కఠోర నరకాజ్ఞకును, మోక్షానంద భాగ్యమునకును, గల భేద మిట్టిదని యీ పుస్తకమున వర్ణింపబడుటవలన నీ ప్రబంధమునకు, "అనిత్య నిత్య వ్యత్యాస" మను పేరు పరగెనని పాఠకు లెరుగవలయును.

అయినను, మోక్ష నరకములు చూచినవార లెవ్వరని కొందరు బుద్ధిహీనులు చెప్పినట్లు చదువరీ, నీవు నీ మనస్సున తలంపరాదు, అట్లని చెప్పనురాదు. ఎందువలన ననగ, నీ యాత్మను నీ శరీరమును సృష్టించిన సర్వేశ్వరుడు శరీర నేత్రములచే నీవు కానకయున్నను నీ కాత్మ లేదనియు, దానిని సృష్టించిన పరమకర్త లేడనియు నీవు చెప్పజాలవు గదా. తా మెరుగని వానిని లేవనుట మానవుల బుద్ధి తక్కువనే

తెలుపుచున్నది. ఎందుకనిన మానవునికి తెలిసినవి కొన్ని, తెలియనివి యనేకములు. నీవు చూడకయున్నను మోక్ష నరకములు లేవని చెప్పనువలదు, తలంపనువలదు. తెలియక చెప్పితివేని, దుర్గంధ నరకములో బడు వారలలో నీవు నొక్కడవు కాగలవని నీవు తెలిసికొనుము. నరకములో నీవు పడకుండునట్లు ప్రపంచపు మాయసుఖములు వట్టివనియు, మహోన్నతంబయిన మోక్షభాగ్యము నిత్యానందదాయకమనియు, నరకాగ్ని బాధ లతి కఠోరములైనవనియు, సమస్త మానవులకు వచ్చెడు మరణ మిట్టిదనియు, ప్రత్యేకపు తీర్పును పొత్తుతీర్పును విధించు టెందులకనియు, పాపముయొక్క దోష మెంతటిదైనదియు, దేవుని యిష్టప్రసాద మహిమ యెంతటిదనియు, మనుష్యుని గతి యెట్టిదైనదియు, సాధ్యమైనంతవరకు నొక్కొక్కటిగా విభజించి వివరముగా విశదపరతును. ఇదిగో వానినిగూర్చి నీవు చదివినమాత్రమునగాని వినినమాత్రమున చాలునని తలంపక, గ్రహించిన న్యాయముల చొప్పున నీ చేతనైనమాత్రము నడుము కట్టి దృఢమనస్సుతో నడుచుకొంటివేని పిశాచి యను శత్రువును నీవు జయించెదవు. సుకృతపుణ్యములను చేయుటకు వీరశూరుడవగుదువు సన్మార్గమున వర్తించెదవు. నరకముయొక్క క్రూర బాధలకు దప్పి నిత్యానంద మోక్షములో జేరి మోక్షవాసులతో కూడ సరిలేని యానందమును నిత్యకాల మనుభవించెదవని ఎరుగగలవాడవు.

# మొదటి వ్యాసము.

## నరక వేదనయొక్క యెరుక.

కారణకర్తయైన పరమ సద్గురుడైన జేసునాధుడు సువిశేషములో నొక్కయెడ నానతిచ్చిన దేమనిన: శపింపబడిన వారలారా! నిత్యాగ్నిలోనికి వెళ్లుడి యను భయంకరమైన శాపవాక్యము.

జీవకోటుల సృష్టికర్తయును అపార దయాపరుడునై యుండెడు దేవుడు తనచే సృజింపబడిన మనుష్యులందరికి నిత్యానంద నిలయమైన మోక్షభాగ్యమును దయచేయుటకు చిత్తగించియున్నాడు. రాజను

సేవించువారలలో రాజు మనస్సునకు ప్రియులగునటుల నడచుకొనువారలెవరో వారలుమాత్రము తగిన బహుమానములు పొందుదురుగాని రాజు చిత్తము ననుసరించి నడువనివారలు రాజువలని బహుమానమును పోగొట్టుకొనుటగాక, ఆయన నాయాసపరచి యాయన కోపమును రగిలించి శిక్షాజ్ఞ ననుభవించుదురుగదా. అట్లే సర్వమునకు రాజాధిరాజైన దేవుడు తాను సృజించిన మనుష్యులలో తమ తిరుచిత్తముచొప్పున నడచువారలకుమాత్రము యీ మోక్షానందమును సంభావనగా నొసంగుదునని యెరుకచేసెను. ఇవ్విధమున న్యాయముతో తీర్పు తీర్చుటయు కొందరికి మోక్ష మిచ్చుటయు కొందరిని నరకకూపమున పడద్రోయుటయు నంత రెరుగుటకై లోకము ముగియు కాలమున చచ్చినవారలందరిని యాత్మ శరీరములతో లేపి, వారు వారు చేసిన పాపపుణ్యములన్నియు నందరికి దెలియచేసి, చెడ్డవారలనందరిని యాత్మ శరీరములతో నిత్యనరకమున బడద్రోసి, మంచి వారలనందరిని యాత్మ శరీరములతో తన వెంట గూర్చుకొని నిత్యానందపదవికి తోడుకొని పోవుదురు.

క్రీస్తువులారా, మీరు నరకమున ద్రోయబడెడు వారలలో లెక్కపడ్డవారలు గాకుండ, నిప్పుడే పరమకర్తయొక్క చిత్తముచొప్పున నడువుడి. ఆయన చిత్తమున కొప్పి నడిచెడు తెరగేదనగా: ఆయన కట్టడ చేసిన వేదకల్పనలచొప్పున నడచుటయు, పుణ్యముల ననుసరించుటయు, దేవచిత్తముచొప్పున వర్తించుటయు నగును. పుణ్యములకు విరుద్ధములైన పాపములు చేసితిరేని, దేవునికి ఎదురు తిరిగినవారలగుదురు. అట్టివారలకు దుర్భర నరకమే సిద్ధించును. ఆ నరకకూపములో మీరు పడకుండుడు. అందు పాపాత్ములు పడెడు అతి కఠోరాజ్ఞలను సాధ్యమగునంతమాత్రము బైలుపరచెదను. నేను జెప్పెడి న్యాయములను మీరు గ్రహించి మీ జ్ఞాపకములో నుంచుకొని నిత్యానంద మోక్షమునకు హేతువైన పుణ్యముల నాశించి, పాపములకు వెరచి, వానిని విసర్జింతురను నమ్మికముచే దుర్భర నరకమును, అందలి బాధలు నిట్టివని మీకు తెలియజెప్ప తలకొంటిని.

ఇదిగో భూమియొక్క పాతాళములో బ్రహ్మాండమైన గుహ యొ
కటి కలదు. అది గట్టు గానరాని సముద్రమువలె నన్నివైపుల నగ్ని
నింపబడినదియు, నెక్కడ జూచిన నాలుగు దిక్కుల నగ్నిజ్వాలలు
బుసబుసమని యెగయునదియు, సూర్యచంద్రుల ప్రకాశము అందు జొర
బారకుండ నెప్పటికి కారుచీకట్లు క్రమ్ముకొనినదియు, దుర్గంధ విషవా
యువులచే నిత్యకాలము విసరబడునదియు కఠోర కుష్ఠవ్యాధులు మొద
లగు నెన్నరాని రోగములను వృద్ధి చేయునదియు, భయంకరమైన
పిడుగు లెడతెగక పడుచుండ చెలరేగుచు నుండునదియు, అక్రమముగ
నొరలుటచే నయ్యో యను ఏడ్పులు విడుపులేక వినిపించునదియు, అనేక
పిశాచము లార్భటించి యొండొరుల మొత్తుకొనుటలతో పిక్కటిల్లి
యుబికి యుబికి వెక్కునదియు, ఒకటిగాక సకలమైన యక్రమముల కుని
కిపట్టయిన మహా కూపమే నరకమని చెప్పబడుచున్నది.

అందులో పడి పాపాత్ములందరు నిత్యకాలము దుఃఖసాగరములో
మునిగి, మడియక మండి, చావక చచ్చి, కుళ్లక కంపుగొట్టి, యెన్న
రాని తన్నులును దెబ్బలును పడుచు బాధ పడుచుందురు. అదియును
గాక పరమకర్తచే శపింపబడిన పాపాత్ములందరును స్వామి ద్రోహులై
యుండుటవలన పిశాచులకు గులాములై, నిరంతరము నీచావలక్షణము
లతో గూడికొని వాచి కంపుబట్టి, తీరని యాకలిని సహింపరాని దా
హము ననుభవించుచు. ఎడతెగక పండ్లు పటపటమని కొరుకుచు కో
డికి మించిన కోపముతో మండిపడుచు, దూషణవార్తలతో ప్రలాపిం
చుచు, మంచి మాట యొక్కటైనను జెప్ప బుద్ధి చెడిన యజ్ఞానులై,
దుర్గంధ నరకమను కష్టపు గుంటలో పడి నిత్యకాలము ఒరలుచు
నెడతెగక పొరలుచు, నారని యగ్ని సంకెళ్లతో కట్టబడి, పిశాచులచే
చెరబడినవారలై యుపనమ్మకముతో వట్టిపోని కన్నీళ్లు రాల్చుచు
యేడ్చి రక్షణములేక ప్రలాపించి, నెనరుగానని నిర్దయులై, మూరని
క్రోధముతో తమ్ముతామే ద్వేషించి, నరకమును విడిచిపోవ నాశిం
చియు వెడలజాలక అగ్నిలోనే యుదుమబడియు నిరంతర నరకములో
పాటుబడుచుందురు. ఆరని యగ్ని సముద్రమువంటి నరకమున పాపా

త్ములు పడి యుందులో నెప్పుడును క్రింది కదుమబడుటవలన, వారల యొక్క కన్నులలోను, చెవులలోను, నోటిలోను, ముక్కులలోను, కాళ్లు సేతులయందును, రోమద్వారములలోను, చర్మమునందును, నరములలోను, ఎముకలలోను, కడుపులోను, ప్రేగులలోను, రొమ్ములోను, హృదయములోను అగ్ని ప్రవేశించి వారల సర్వాంగములలో దూరి యుబ్బి బైటికి వచ్చుటవలన నావమున మండు కట్టెలులాగున ఆ నరకమున పాపాత్ములారని కట్టెలై మండుచుందురు. అదియునుగాక, ఇటికల గోడలో నొకదానిపై నొకటి నొత్తుకొని యుండునట్లును, గానుగలో చెరకు నలుగులాగునను, నరకములో బడియుండెడు దుష్టాత్మ లొకనిమీద నొకడు పడి యొత్తుకొని నలిగి సొక్కి పడిన పాటుననే యగ్నిసముద్రములో ననంతి కాలము కరణను నాశలేక క్రుంగి యెడతెగక నరకబాధలు పడుచుందురు.

అయ్యో పాపాత్ములారా, ఇటువంటి బాధల ననుభవింపనో, పసలేని దుర్మతముల ననుసరించితిరి! ఈలాగున కాలి మండుచుండనో, తబ్బర దేవుళ్లను పరమవస్తువని యారాధించితిరి! ఈలాగున పాట్లుబడనో, బీదల నుపద్రవపరిచి యహంకారులై తిరిగితిరి! ఇట్లు కుళ్లి కంపు బట్టనో మీ శరీరములకు మినుకు జేసి సొమ్ములతో ఆభరణములతో నలంకరించుకొంటిరి! ఈలాగున పట్టిపోని కన్నీళ్లు విడిచి యేడ్వనో, వ్యర్థ ప్రపంచపు మేలులమీద మనస్సుంచి కామలీలలే సుఖమని యనుభవించి తిరిగితిరి! ఇట్లు నిందలు బడనో, పరులపై చచ్చుపర్యంతము విడువనోపమని పగ సాధించితిరి! ఈలాగున పిశాచములకు దాసులై పడి యుండనో, సద్గురుని సువార్తలు మీరి నడిచితిరి! ఈలాగున నగ్నిసంకెళ్లతో కట్టబడనో, యేలినవారి కల్పనలప్రకారము నడువక స్వేచ్ఛగ తిరిగితిరి! ఇట్లు తాళగూడని యాకలి దప్పు లనుభవింపనో, విధించబడిన యొక్కప్రొద్దులు, ఉపవాసములు అనుసరించక పోతిరి! ఇట్లు లేక ఘోరదారిద్ర్య మనుభవింపనో, పరదేశులకు భిక్షమియ్యక పోతిరి. ఈ కష్టపు గుంటలో పడి పొర్లాడనో, పరస్త్రీల నలమటపరచి కామాతురులై నడచితిరి. ఇట్లు మనస్సు తాళజాలని దూషణములచే

నిందింపబడనో, నోటినుండి కఠిన సాక్ష్యములు దూషణలు కొండె ములు నీచవార్తలు చెప్పి హానిని సాధించిరి. ఈలాగున పిశాచి దాసులై వాని కాలి తిన్నులు చేరి గుద్దులు బడనో, మీ తలితండ్రా దులను కొట్టి తిట్టి శ్రమపరచితిరి? ఈలాగున కతలని కట్టెలవలె నొక రిపై నొకరు పడి మొత్తుకొనుచుండనో. కట్టడ చేయుబడిన తిరునాళ్ల ను, ఆదివారములను ఆచరింపకయు, అప్పు పూజ చూడకయు సోమ రులై తిరిగితిరి! అయ్యో పాపాత్ములారా, ఇంకను మీరు దేవుని కవి ధేయులై మరణపర్యంతము నడచితిరేని, యిదిగో ఇప్పుడు చెప్పబడి నలాగున ఇకమీదట దుర్భర నరకములో మీరును నిత్యకాలము లెక్కలేని బాధల ననుభవించుదురనుటకు సందేహములేదు.

ఇవ్విధమున సకల బాధలకు తావరమైన దుర్భర నరకములో శపింపబడిన ద్రోహులు పిశాచుల పాదములక్రింద కాలి మండుచుండు టయేగాక, ముందీలోకములో ననుభవించిన సుఖ చెల్వములలో నొక్కటియైన గానకయు, బంధుజనుల సహాయము పొందకయు, నురం తమైన యగ్ని సముద్రములో మునిగ మండి కాలుచుందురు. ఓరి పాపా త్ముడా, ఇటువంటి దుర్భర నరకములో బడి కఠిన బాధ లనుభవించు వారలను నీ జ్ఞాననేత్రములతో చూచుటలేదా? వారలు పాపపు త్రోవలో నడిచినందున గదా నరకమున బడిరి! వారలవలెనే నీవును పాపమును విడువక యీ మార్గమున నే హానిని సాధించి నడచితివేని, ఆ దుర్భర నరకమే నీకును నివాస స్థలమగునని నమ్మి, ఇదిగో యిప్పు డె, అనుకూల కాలముండగానే, పాపమును విడిచి పుణ్య మాచరించు నదియే చేయవలసిన కార్యమని తలంచి, పూర్ణముగా మనస్సు త్రిప్పు కొని శీఘ్రముగా పుణ్యములను జేయవలెనని పద్దు పట్టుదువుగాక.

# రెండవ వ్యాఖ్యానము.

## నరకముయొక్క ఆజ్ఞ.

దుర్భర కష్టబాధలు నిండిన నరక పాతాళమను నగ్ని సముద్రము లో బడి మునిగినవారలు, తాము చేసిన పాపములకు: కంటితో గనిన

దుష్టదృశ్యములకును, చేతులతో చేసిన దొంగతనములకును, అంగములచే సల్పిన కామచేష్టలకును, కాళ్లచే కట్టుకొనిన యక్రమములకును, వాక్కుచే పలికిన దబ్బరలకును, చెవులచే వినిన చాడి కొండెములకును, ముక్కున నాఘ్రాణించిన పాపసంబంధమైన పరిమళ వాసనలకును, జ్ఞాపకమున స్మరించిన వాంఛలకును, మనస్సున కోరి తలంచిన లీలాశలకును, ద్రోహములకును, బుద్ధికి తోచి తెలిసి చేసిన వివిధ పాపకార్యములకును తగిన మహా కఠోర శిక్షల ననుభవించుదురు. ఆదెటువలెననగ, అవిగో బ్రహ్మాండమైన యురుములును పిడుగులును నరకమున బడిన పాపాత్ములయొక్క చెవులలో దూరి చీల్చికొని పోవును. మరియు నచ్చట మహా దుర్గంధమైన గంధకము కరగి మహా ప్రవాహముగా చుట్టు ముట్టి వారల చెవులలో బారును. ఇదే వారు చెవులచే జేసిన పాపములకు వచ్చు ఫలమని తెలిసికొనవలెను.

నోటనుండి దూషణములు, చాడి కొండెములు, దబ్బరయానలు పలికినందుకై యారని యగ్ని నిండిన నరకములో బడి కాలి మండుచుండుట వారలు భరింపలేకుండ పటపటమని పండ్లు కొరుకుటయు, నాలుక చీలుటయు, చిరునాలుక యంగిట నంటుకొని పోవుటయు, చిగుళ్లు పగులుటయు, నోటినుండి నిప్పువలెను నురుగువలెను రక్తాగ్ని జ్వాలలు వెడలుటయు సంభవించుచుండును.

శరీర మనుభవించిన కామసుఖమునకు శిక్షగా నిపుడు నరకములో కదలని కట్టెలవలె వారలయొక్క సర్వాంగములు నిప్పు లంటుకొని తిత్తులు కట్టి మండి యపార వ్రణములై, చీము నీరు లూరెడు పీనుగులై, దుర్గంధమగు కంపుగొట్టి నరములు తోలు నెముకలు ప్రేగులు నీరువను దొమ్మలును కడుపు నుబ్బి నలిబడి పగిలి కంపుబట్టి, హృదయము విచ్చి, తలచిప్ప చీలి ఘోరముగ మండి కాలుచుందురు. అప్పటికైన నీ బాధ యారునా? లేదు లేదు. ఈ వేదన వదలక యెన్నటెన్నటికిని కళ్లి కుళ్లక, చెడక కంపుబట్టి, చచ్చి చావక, నిత్యకాలము నరకబాధనట్టే యనుభవించుచుందురు:

కంట జూడరాని నానా విధ పాపములను జూచినందులకు గదా

వారల కన్నులలో నగ్ని నదు లెడతెగక పారును. కన్నులు గ్రుడ్డివై పోయినను, పిశాచులు భయంకర రూపములతో నుండుటయును, నరకవాసులు కాలుచుండుటయును, అట్టివారు గిరగిర తిరిగిపడి బిత్తర పోయి లేచుటయును, బుసపెట్టుచు గసబోయుచు వణకి పొర్లాడుటయును, అడుగులు త్రొక్కుళ్లు పడి క్రుంగి క్రింక బడుటయును చూచి తాము నల్లే వేదనల బడి బెదరి తత్తరపడి పదరి యేడ్చుదురు. కన్నీళ్లు విడిచి యెంత యేడ్చినను వారల కన్నీళ్లు తరగక కారుచునే యుండును. ఓరి పాపిష్ఠీ, అట్టిదానిని నీవు తలంపక యుందు వేమి? ఈ కఠోర బాధలన్నియు కొంచెమనియు ప్రతిదినము చూడరాని చూపులు చూచి పాపములను పెంపు చేసికొనుచున్నావు!

ముక్కుతో పాపహేతువైన వాసనల నాఘ్రాణించినందుకు గదా యిపు డెడతెగక కఠోర నరకకూపములో దుర్గంధపు పీనుగుల కుళ్లు కంపు నెగబీల్చి యుందుచే ముక్కు పగులగా దానినుండి పొగ లెగచి మండగా ముక్కు బొక్కలకు గాలి రాకుండ దగజుట్టుకొని బుసపెట్టి దద్దరిల్లుచున్నారు. ఓరి పాతకుడా! ఇట్లు నరకమున బాధ పడెడువారలను నీవు తలంచుట లేదా? అల్పమైన లౌకిక సుఖమునకు గదా యింత నిష్ఠుర బాధ లనుభవింపవలసి వచ్చినది.

ఇదిగో కూడని దానికొరకు మనస్సున నిచ్చగొని యాశించినందుకు, ఎన్నటెన్నటికి నారని నరకమున బడి తమ్ముతాము నిందించుకొనుచు నగ్నిలో కాలి క్రుంగి క్రిందుమీదులుగా పదరి, నిరాశతో నాలుక కొరకుకొని రొమ్ములు గుద్ది పగులగొట్టుకొనుచుందురు.

భోజనప్రియులై చరించినందుకు శిక్షగా ఘోరమైన నిప్పులో బడి కాలి మండి ఆకలి దీర దాహమార నొక పిడికెడు తవుడుగాని చేరెడు నీళ్లుగాని కానక, మండి యెరచి యెరచి నోరు పగులగా, నాలుక మొండివోగా, నక్కుళ్లు కదియబడ కడుపు వెన్నముక కంటుకొనిపోగా, వార లయ్యయ్యో, ఆకలిచే మాడుచున్నాము, తపించుచున్నాము: మూర్ఛిల్లుచున్నాము, ఆకలి తీర్చుకొన నేమియు కానమే, దాహము తీర నీరు బొట్టయినను కానమే, అలపు సొలపులు తీర్చ నాదరవు

కానమే, మఱి చెడ్డ పాతకు లెవరని వివిధముగా నార్భటించి రోలుచు నిత్య నరక వేదనల బడుచుందురు.

అయ్యో పాపాత్ముడా! యీలాగున నంతములేని యగ్నిలో సర్వాంగము నెల్లప్పటికిని కాలని కష్టమై కాలుచు కంపుబట్టి పోవుట యల్పవేదన యనియా లోకసుఖమును నాశించి, శరీర దుర్గుణముల ననపక యున్నావు. నరకముయొక్క దుర్గంధము నీ ముక్కు రంధ్రములు నిండి వెడలుట నీకు బాధ లేదనియా మోహాసంబంధ పరిమళ వాసనను నీవు ముక్కున నాఘ్రాణించుచున్నావు. పగిలిన తల బుఱ్ఱతో మూసికొనిన చెవులతో చెడిన కన్నులతో తెగిపడిన కాళ్లు చేతులతో నెడ తెగని నరకకూపములో నిత్యకాలము కాలుట కొంచెమనియా ఆదివార మప్పుపండుగలలో దివ్యపూజ కావకయు, అప్పు ఒక్కప్రొద్దు ఉపవాసము లుండకయు, కడకు ఏడాది కొకసారియైన పాపవిమోచనము జేసికొనకయు నున్నావు. నిరంతరము దుష్టపిశాచుల చేతులతో దెబ్బలు పడుట కొంచెమనియా, ఆ పిశాచులయొక్క మంత్ర తంత్రములు మాయజోస్యములు నేర్చికొని వానిని నమ్మియున్నావు. తరిదరులు లేని నరకములో నారక మందుట కొంచెమనియా తల్లిదండ్రులను పెద్దలను కొట్టుటయు చాడీకొండెములు చెప్పుటయు నపదూరులు నాలకించుటయు లోనగు చాల చావైన పాపములను విడువక చేయుచున్నావు. మహా క్రూరముగ తన్నుతాను గ్రహించుకొనుచు నారక కాలుట కొంచెమనియా పరులు చేసిన నేరముల నోర్వక చచ్చుపర్యంతము పగ సాధింప వైరాగ్యము పెట్టుకొనియున్నావు. నరకములో చావని చావు చచ్చుట తృణమాత్రమనియా కులపాతకము చేయ నిశ్చయించుకొని యున్నావు. కఠోరబాధలతో కాలి యారని తీరని యాకలిదప్పు లనుభవించుట కొంచెపాటిదనియా పేదల దారిద్ర్యము చూచి మనస్సు కరగక కొంచెమైన సహాయము చేయకయున్నావు. ఎన్నటెన్నటికిని నరకమను చెరసాలలో మూయబడి క్రూరపిశాచుల కాలి తన్నులు పడి చెప్పరాని బాధ లనుభవింపనా పరుల సొమ్ములు దొంగలించి తిరుగ వానిని చెల్లింపక యున్నావు. నిరంతరము నిందా

వమానములతో తన్ను గుద్దులు పడుట కొంచెమనియూ యితరులను స్నేహింపక నిందించి ఉపద్రవపరిచి నిష్ఠురుడవై తిరుగుచున్నావు. శరీరమంతయు పుచ్చి పుండ్లై పురుగులు పట్టి కంపు గొట్టుట రవంత యనియూ స్త్రీభోగము నాశించుచున్నావు. ఓరి పాపీ! నీ పాపాత్రమములను విడువకయున్న నట్టి బాధలుగల నరకమున నూరట జెందక నిత్యకాలము మండుచుండెదవు.

ఒక రాజు పిశాచిని క్షణము సేపు మాత్రము చూచినంతనే బుద్ధి భ్రమసి మూర్ఛపోయి క్రిందపడి చెప్పినదేమనగా: లోకము ముగియు పర్యంతము గనగన మండెడు నావములో నన్ను వేసిన సహించి యుండుదునుగాని నేను చూచిన పిశాచిని తిరుగ చూచి సహింపలేననెను. ఓరి పాపీ వింటివా, ఒక పిశాచిని చూచినందుకే యింత భీతి కలిగి యుండగా నరకము లెక్క కగ్గళమైన పిశాచముల నెడ తెగక చూచుటగాక, వానిచే తరగని తన్నులు బడి నిష్ఠురముగా బాధింపబడుట మరి యెంత ఘోరమో కనుగొనుము. ఒక్క పిడుగు గుమిరిన ననేకులు క్రిందబడి చత్తురుగదా. నరకమునందో యన: బ్రహ్మాండమైన యురుములయు పిడుగులయు శబ్దము లెడతెగక వచ్చుచు మహా భయంకర సందడి చేయును. లెక్కలేని పిశాచులు తిరుగాడుచుండ నగణిత పాపాత్ము లార్భటించెడు నార్పుల నీ వెట్లు లోర్చికొందువు.

ఇదిగో యీ లోకములో నురుములను పెట్లదుమ్ములను పెద్ద నగారులను మొదలగు వానినెల్ల నేకముగా బోరుకొల్పినను వాని ధ్వని నరకములో నున్న యొక చిన్న పక్షి కూతకైన సరిరాదని యొక్క మహాత్ముడానతిచ్చినది నీవు వినలేదా? అయ్యయ్యో పాతకుడా, ఇంత కఠినమైన నరకాజ్ఞ నెటు లోర్వదలంచియున్నావు? ఈ లోకమున నొక పిశాచి యొక పాపాత్మునికి కనిపించి నరకముయొక్క యగ్ని కణము నొకదానిని వాని చేతిలో విడిచినతోడనే వాని చేయి రెండుగా చీలి మండెను. స్వల్పమునకే యిట్లుండగా గట్టు కానని యగ్నిగుండములో నిత్యకాలము సర్వాంగము కాలి మండుచుండ నెట్లుండునో వర్ణించు వారెవరు? కావున పాపాత్ముడా, కాలముండగనే జ్ఞాననేత్రములు

తెరచి చూడుము. నరకమున బడినవారలు, మేము తెలిసియు నిక్కడ పడవలయుననియే పడియున్నామని తమ బుద్ధి యెఱుకచే నెఱిగి యుండుటవలన, అట్టి వారలకు చావని చావై యుండు నెల్లప్పుడును వారు గొణుగుకొనున దేమనగా: మా బుద్ధి చెడి స్వామికి ద్రోహము జేసితిమి. నరకాగ్నియా ముగియదు. ముగియనివియు నారనివియు నిత్యకాల ముండునవియునైన నరక వేదనలు మే మనుభవింపవలెను. తెలిసియు వేదకల్పవలను మీరి యీ నరకమున బడితిమి. నిత్యముగా మతి చెడిన వారలమైతిమి. బుద్ధి సామర్థ్యములచే నేర్చిన శాస్త్రములను అభ్యసించిన విద్యలను మరచి యిక్కడ కాలుచున్నాము. భూలోకమున సౌందర్య గౌరవ మహిమలు గలవారలమై యుంటిమి. అనేక సుఖభాగ్యము లనుభవించితిమి. ఇప్పుడు వానిలో నొకటియు గానక నీచులవలె పిశాచులచే తన్ను గుద్దులు తిని కఠిన బాధ లనుభవించుచు నరకమున నారని యగ్నిలో మండుచున్నాము.

పాపాత్ముడా, ఈలాగున నారని యగ్నిలో బడి కాలుట నీకు మేలా? పరలోకమున ఘనసంతోషానందము గనుట మేలా? నీచుడవై నిందబడ నిష్టమా? మోక్ష రాజ్యాంగ భద్రాసనములపై గూర్చుండ నిష్టమా? నీ జ్ఞాననేత్రములు తెరచి చూచితివేని మంచి త్రోవ నెఱిగి యుందులో మరణపర్యంతము కదలక నడుచుదువు. అట్లుగాక పాపపు త్రోవను నడిచితివేని, యీ దుర్భర నరకమే నీకు కలుగునని యెఱుగుము.

## మూడవ వ్యాఖ్యానము.

### నరకముయొక్క విశేష ఆజ్ఞ.

నరకమును కనినవార లెవ్వరని పామరులు పలుకుట తగదనుటకు నరకములో సంభవించెడు విశేష శిక్షాజ్ఞ లిట్టివని యొక మహాత్ముడు చూచివచ్చి చెప్పినప్రకారము మేము బయలుపరచెదము. పరాకు లేక వినుము: ఇదిగో భూమియొక్క పాతాళములో కడగానని యగ్ని సముద్రమును కంటిని. అందులో నెన్నికకు రాని స్వామి ద్రోహులు సముద్రములో చేప లీదినట్టు లీదుచు నానా శిక్షాజ్ఞలు పడుట గం

టిని. ఒకని ననేక పిశాచములు పట్టుకొని యగ్నిచే కట్టబడిన యొక యి రుకు స్థలములో నిలువబెట్టి దెబ్బలు కొట్టి బుస్సుమని కఠోరముగా కొక్కరించి భయంకరమైన తన్నులు తన్ని వాని వడి నెత్తిని గండిచేసి యందు కరగిన గంధకమును సీసమును బోసి వానిని గిరగిర ద్రిప్పి ఘోరాగ్నికూపములో బడద్రోసి క్రూరబాధలు పెట్టుచుండిరి. వాడు లోకములో కామసుఖమే సుఖమని యెంచి కామాతురుడై తిరిగినవా డని తెలిసికొంటిని. అదిగాక మరి యనేకులను బాధించుట చూచితిని. అదేలాగనిన: వారలను తలక్రిందుగా వ్రేలగట్టి గొఱ్ఱె పిల్ల చర్మము నొలిచెడులాగున వారల తోలొలిచి కండలు నజ్జునజ్జుగా నరికి యె ముకలు తునుకలు తునుకలుగా కత్తిరించి, ప్రేగులు దొమ్మలీరువలు వెళ్లబీకి, ఘోరాగ్నిలో త్రిప్పి త్రిప్పి కాల్చుట కంటిని. ఇదిగో యీ దండనలు పడువార లెవరనగా: లోకములో నన్యాయము చేసి పరుల నటమటించి వారల సొమ్ములన్ని దోచుకొనిన రాజులుగను దొరలు గను నుండినవారని తెలిసెను. మరియొక ప్రక్క పిశాచు లొకనిని పట్టుకొని ఇనుప గుదెలతో పడగొట్టి కుక్క చర్మమువలె వాని చర్మము నొలిచి కరిగిన సీసము వానిపై కుమ్మరించి మహాగ్నిలో పడ వేసి కాల్చుట చూచితిని. వాడు లోకములో యుక్తిగలవాడై పేదల నటమటించి వారి సొమ్మంతయు నాచుకొని తిరుగ చెల్లింపక నీలాగున నిత్య నరకాజ్ఞలు పడుచున్నాడని తెలిసెను. మరి యవతల బోయి చూడగా, ననేక పిశాచులు కన్నులయందు నగ్నికణములు వెడలు చుండగా మిణుకు మిణుకుమని గుడ్లురుముచు పాములవలెనే బుస్సు మని నోటినుండి అగ్నిజ్వాలలు విడుచుచు గనగన మండెడు నినుప గుదెలతో మొకడు నేలబడ కొందరి తల చిప్పల దెగగొట్టి వారల సర్వాంగములను నిప్పు గుదెలచే నలగ బాదుచు నగ్నిగుంటలో తో యుట గంటిని. ఈ దురాత్మ లెవ్వరనగ, దుర్మతముల ననుసరింప నేర్చుకొని దొంగగురువులై తిరిగినవారలై యుండిరి. మరి యవతల బో యి చూడగా గట్టుగావని యగ్ని సముద్రములో చేప లీదుచు గంతు లు వేయునట్టు, లెక్కలేని పాపాత్మ లూపిరాడక ఈదుచు బుస

బెట్టుచు గనలు పోసికొని యయ్యో యని యేడ్చుచు దరిగానలేని యెగిరి యెగిరి పడి గంతులు వేయుచు నిరాశగా నిత్యకాలము కాలుట గంటిని. వీర లెవ్వరనగ: కర్త్యవేశము చేకొనక పోయినవారలును, ఒక వేళ చేకొన్నను దాని కల్పనలచొప్పున నడవక దబ్బరయానలు బెట్టి తలిదండ్రులను నిందించి నానా పిశాచి తంత్రములకు లోబడి యుప్పు పూజ కానక యారవ కల్పన మీరి మరణపర్యంతము ఘోర పాపములలో పందులవలె పొరలాడిన వారలని తెలిసెను. మరియు నవతల తల యెత్తి చూడగా, నొకని ననేక పిశాచులు పట్టుకొని యొక చక్రములో నిరికించి బిగియకట్టి యా చక్రము చీలల మొనలన్ని వాని దేహమాద్యంత మొకప్రక్క గుచ్చుకొని మరొక ప్రక్క వెడలి రాగ నది గిరగిర చుట్టి క్రిందికి విదిలించి యడుగంటని ఘోర పాతాళమున పడద్రోయగా వాడు అదరిపడి యార్భటించెడు కఠోర రోదనములు విని నరకమంతయు గడగడ వణకి నందులో గల పిశాచులన్ని భయపడి బిత్తరపోయి యభయహస్త మీయరో యని మొరపెట్టు నా చక్రములో కట్టబడిన వానిని దూషించి తిట్టుచు, వీడేగదా ముప్పది వెండికాసుల కాశపడి గురువైన జేసునాధుని దుష్టుల కొప్పగించిన జూదాసు ఇస్కారియోత్తనెడు పరమద్రోహియయిన శిష్యుడు! ఇదిగో వీడు చేసిన మహా ఘోర పాతకమునకు మాతోకూడ నీ నరకమున నిత్యకాల మిట్లు పాటులు పడునట్లు స్వామి తీర్పు జేసి కట్టన యిచ్చియున్నాడుగాన ఆ మహా ద్రోహిని విడవకుడి, పట్టు పట్టుడు, కొట్టుకొట్టుడు, నరుకు నరుకుడని పిశాచులు కేకలు వేయుచుండుటను విని యీలాగున నరకవాసులు నిత్యకాలము కఠోరాజ్ఞ పడుట తెలిసి కొంటినని యా మహాత్ముడు చెప్పెను.

ఓరీ పాపాత్ముడా, ఇంకను నరకము నొందినవారలనుగూర్చి విన గోరుచున్నావా? ఇదిగో నీ పాపము విడిచిపెట్టుటకిది చాలదా? మరి యొక విశేషము చెప్పెద వినుము. ఒక రాజు దగ్గర బహు దినములు సేవించిన ముసలి సేవకుడొకడు మరణము పొందెను. ఆ దినమే వాని సతి నా పురుషుడు చచ్చిపోయెనుగదా, వాని యాత్మ యెక్కడ

నున్నదో యని యెరుగ గోరెను. తనకు సర్వేశ్వ డామె కొక దర్శనము కనుపింప జేసిరి. అదేలాగనగా, ఆపె పురుషుని యాత్మము నరకపాతాళములో పడిన వెంటనే యనేక పిశాచ ములా యాత్మను చుట్టుకొని యెఱ్ఱగా గాలిన చాల చురుకైన మొనలుగల చీల లున్న యొక యినుప చట్టను వానికి తొడిగించి యా మొలలు వాని శరీర మాద్యంతము దూరి గుచ్చుకొని లోపలికి దిగునట్లు మహా క్రూరముగా కొట్టి తన్ని, ఓరీ నీవు లోకములో శోభ గలిగి తిరిగినందుకు నరకములో నీకు వచ్చిన ఫల మిదేరా యని చెప్పుచు పిశాచులు వానిని బట్టి బగబగమను మంటలతో మండెడు నగ్ని మంచముపై పరుండ బెట్టి వానిని నలుగ బొడిచి కన్నులు ముక్కు చెవులు నోరు సకల రోమద్వారములు నిండా రక్త మెల్లను పారగా నెముకలు పెళపెళ విరుగద్రొక్కి, ఇదిగో లోకమున నీవు కామ విలాసములలో మొనగాడవుగా తిరిగినందుకు నీకు నిత్యకాలము సంభవించు బహుమాన మిదే యని చెప్పుచు తన భర్తకు నానా వేదనలు పెట్టుట గని యా స్త్రీ చాల భయపడి సహింపలేక అయ్యయ్యో యని యార్భటించి నానాధా చెడితివా, స్వామి మొక్క కల్పనలు మరచి నీ దుర్మనో వాంఛలచొప్పున నడిచినందుకు ఇలాగా యీ నిష్ఠుర నరకాగ్నులకు లోనైతివని చెప్పి కలంగి గడగడ వణకి నేల కూలెను.

హా పాతకుడా, నరకము నొందినవార లెవ్వరని ఇంక నడుగుదువా? నరకమున్నదని యెరింగి దానిలో బడుట భయంకరముగదా. పాపమార్గము విడిచి పుణ్యమార్గము బట్టవా? ఇదిగో పాపపు మనులు విడుచుటకేదియు చాలకపోయినయెడల నింక గొన్ని విశేషములు చెప్పెద వినుము: నీవలెనే మహా పాతకుడైయున్న యొకడు తాను చేసిన పాపక్రమములకు నరకమే సిద్ధించునని తెలిసికొనియుండియు, భయపడక నానావిధ పాపములలో మునిగి తేలుచుండగ నొక మహాత్ముడు వానికి నానావిధ సుబుద్ధులు చెప్పి తపము చేయ బెక్కు సారులు బోధించినను, వాడవిధేయుడై యుండెను. ఒకనాడా మహాత్ముడు వానిని జూచి, ఓరి వత్సా, నా దగ్గరకు రారా, నే నన్నియో మా

రులు నీకు బుద్ధి చెప్పినను వినవని హఠము సాధించెదవా? ఇదిగో నిన్నొక చిన్న మనవి యడుగుచున్నాను. అదేమన: ఈ రాత్రి నీపడకమీాద పరుండునపుడు నీకు సరిపోయిన తట్టున కొరగుకొని, యట్లే యుదయమగుపర్యంతము కదలక పరుండి యుంటివేని నీకు బుద్ధి రావచ్చుననెను. అందుకు వాడు ఓహో మంచిది యాలాగుననే యుండెదనని చెప్పి తనకు సరిపోయిన ప్రక్కకు తిరిగి పండుకొని నిద్రపోవ చూచెను. కొంతసేపు అట్లే పండుకొనియుండి చూడగా నిద్రపట్టక శరీరమంతయు కదలక తిమ్మిరి పట్టుకొని తలత్రిప్పికొని మరొక తట్టునకు తిరుగ మనస్సు వచ్చినను తానిచ్చిన బాసనుబట్టి యట్లే కదలక యుండెను. మరికొంతసేపటికి తల వెనుక ప్రక్క నొప్పియు శరీరమున బాధయు నధికమయ్యెను. మెత్తని పరుపమీాద పరచియుండెడు దూది తలగడ దిండును గులక రాళ్లవలె నొత్తుకొనసాగెను. తల బరువై మంటలెత్తగా మనస్సు మిక్కిలి కలంగెను. ఇదిగో ఇట్టి మనస్సు కలతలతో తనలో తానిట్లనుకొనుచుండెను: అయ్యో పాపీ, మృదువైన పడకమీాద పండుకొని యొక్క ప్రక్కనే తెల్లవారువరకు పరుండజాల వనుచున్నావు కదా. అయిన దుర్భర నరకపు ఘోరాగ్నిమంటల నెట్లు సహింపబోవుచున్నావు. సుఖకరమైన దూదిమెత్తయొక్క బాధనే తాళజాల ననుచున్నావే. ఆరని అగ్ని నరకములోని మారని మంటల నెట్లు సహించెదవు? చేసిన పాపములకుగాను నీ లోకమున సాధ్యమైనంతవరకు తపస్సు చేయక పోయినట్లయిన ఘోర నరకమే నీకు సిద్ధించును. పుణ్యములను చేయక కాలయాపనము చేయుటెందుకు? మరణ మెప్పుడు వచ్చునో తెలియదు కనుక ముందే పుణ్యమార్గములో నడచి పాపములను వర్జించి మోక్షము పొందవలెనని నిశ్చయించుకొని లేచి యంతట తాను చేసిన పాపములకై బహుగా నేడ్చుచుండి తెల్లవారగానే గురువు కడకు బోయి మంచి పాపసంకీర్తనము చేసి మరణపర్యంతము ధర్మమార్గమున నడిచెను.

అయ్యయ్యో పాతకుడా మేలుకొనుము, నీ పాపపు నిద్రమబ్బు విడువవా? మా యరపులు నీ చెవిలో పడవా? ఇకనైనను కొంతసేపు ఘోర

నరక వేదనలను తలంచి పాపపు త్రోవలో నిదివరకు నడిచినది చాలునని యెంచి నిత్యానంద మోక్షమగు పరమగతిని పొంద నీ మంచి కాలములోనే పుణ్యమార్గము నవలంబించుము. పాపమును విడువనని చెడ్డత్రోవలోనే తిరిగినయెడల, నిదిగో యిపుడు చెప్పబడిన దుర్భర నరకములో నీవును నిత్యకాలమారని కట్టెగా కాలబోదువని యెరుగుము.

# నాలుగవ వ్యాసము.

## నరకముయొక్క నిత్యశిక్ష.

ఎన్నటెన్నటికి ఆరని యగ్నిసముద్రమైన నరకములో చెప్పతరముకాని బాధలు పడుటయే నిత్యనరక బాధ లనబడును. ముగింపులేని బాధలు పడుట యనగా నర్థ మేమన: ఏ కాలమునందైన దుర్భర నరక కఠోర బాధలు తక్కువపడవు, మారవు, తీరవు, ఆరవు, సతతముగా నుండును. అందు బడిన వానికి కాలి మండుటయు విలువక దెబ్బలు పడుటయు నిర్బంధ బాధలతో ప్రలాపించుటయు రోలుటయు మొదలగు శిక్షలు నిత్యకాలము కలుగుటవలన నవి నిత్యశిక్ష లనబడును. అయ్యయ్యో పాతకుడా స్వల్పమైన మన జీవితకాలమున పుణ్య మాచరింప ప్రయాసపడినందువలన నెప్పటికిని ముగియని నరక బాధలకు లోనయ్యెదవుగదా. హా పాపాత్ముడా, ఈ లోకమందుండు దుమ్మంతటిని చిన్న చిన్న రవలుగా నెంచి సముద్రముయొక్క నీళ్లన్నిటిని బొట్లు బొట్లుగా లెక్కించి భూమిపైగల చెట్ల యాకులన్నిటిని గణించి పరమండలమున కనిపించెడు నక్షత్రములన్నిటిని లెక్కచేసి యా లెక్కలన్నియు నొక్కటిగా కూర్చిన నెంతయగునో యన్ని కోటానకోట్ల సంవత్సరములు గడిచినను నరకము ముగియదు. దానియొక్క యుగ్రతయును తగ్గదు. ఆ మహా నరకములో మండెడు మంటలకును, తగిలెడు తన్నులకును, పడెడు నిందావమానములకును తక్కువలేదు. దుర్మనస్సుగల పిశాచులు చేయు నిష్ఠుర బాధ లనేకములు ఎన్నటెన్నటికిని ముగియవు, తీరవు, మారవు. మారక తీరక ముగియక యారక నీకు నిత్యకాల మగ్నిబాధ లుండును. కుళ్లక కంపు కొట్టుదువు. పెక్కు

తన్నులు పడుదువు. అది చూచితిరా నరకవాసులు చచ్చుట వాసి యని యీ ప్రక్క కా ప్రక్కకు దూరి దూరి పారిపోదురు. అయినను నరకమున నెచ్చోటను దుర్గంధపు కీలును గంధకమును గుగ్గిలమును కరగి నరకవు గుంటలో పడుచుండును. అందు బడి తలక్రిందుగా కాలి యయ్యో యని యరచుచు జావు నాశించినను చావు రాదు. భయంకర పిశాచులు చుట్టుకొని తిట్టి తన్ని బాకి పొడుచుచుండును. అచ్చోటుననే చత్తుమా యని నేల కూలుదురు. తన్నులు దెబ్బలు వేటులు పోటులెన్ని పడినను చావక యట్లే పడియుందురు. ఇవ్విధమున నెడ తెగక పడెడు దెబ్బలు చాల మండెడు నగ్ని యారక ఘోరమైన నొప్పులు మనస్సు చాంచల్యము తీరక యెప్పటికి నిత్యబాధ లనుభవింపవలెను.

ఓరీ పాపాత్ముడా తెలిసినదా? పాపాత్ములకు రాబోయెడు బహుమానమేమన యిది కనుగొంటివా? అయ్యో పాతకుడా, ఇప్పు డొకనాడు ఒక్క ప్రొద్దు నుండ నోపకున్నావు! ఎన్న డెన్నటికిని తీరని యాకలిని యారని దాహము నీ వెట్లు తాళగలవు? ఇపుడు నిత్యమైన మేలులు గోరి కొన్నాళ్లుమాత్రమే కష్టపడ లేననుచు నీ లోకములోని యల్పపు మేలులపై వాంఛ బెట్టి వ్యర్థముగా తిరుగుచున్నావు. నిత్య నరకాగ్ని మంటలో కాలు టెట్లు సహించెదవు? ఇపుడు నాలుగునాళ్లు విరక్తితో నుండ లేననుచున్నావే. ముగింపులేని కాలము శరీర ముబ్బి పుచ్చి పురుగులు బట్టి కంపు గొట్టుచుండుట కెట్లు మనసొప్పి యుందువు? ఇపుడు పరులు చేసిన చిన్న నేరమునే యోర్చి యుండ లేవుకదా, నరకమున పిశాచులకు దాసుడవై తన్నులు దెబ్బలు పడుచు హీనుడవై యుండుట నెట్టు లోర్వవలెనని యున్నావు? ఇట్టి యెడ తెగని బాధలు బడుట తృణమని యీ పాపమార్గముననే నడుచుచున్నావు. అయినను నరకమునకు పోయెడువాడు పోవునుగాని నేనందులోనికి పోనందువు కాబోలు! మంచిదే, అటువంటి నిత్య బాధలు గల నరకములో పడకుండునట్లు నీ సమస్త దుర్గుణముల నణచి పాపక్రియములను విడిచి న్యాయముతో నడచుచున్నావా? నరక బాధలలో పడకుండ నీ పాపములకై తగిన తపస్సును, దానధర్మాదులును చేసి నిత్యైక

వ_వగు దేవుని నారాధించి యాయన కట్టడ జేసిన పూజారాధన వందన జపధ్యానాది నిష్టలు తప్పక యనుసరించుచున్నావా? లేదు కదా. అవి లేనట్టయిన నరకమునకు పోయెడువాడను నేను కానని నీ వెట్లు చెప్పెదవు? అనేకులు తలంచని కాలమున పాపములో చచ్చి నరకమున పడుచున్నారు. ఇదిగో ఒక్క సాదృశ్యము నీకు చెప్పె దను వినుము.

పారీస్ పట్టణములో నీవలెనే మహా శుద్ధ పాపములలో మునిగి యుండిన యొకానొక దొర వ్యాధిబడి మరణావస్థలో నుండుట విని యీయూరి మేత్రాణులు వానిని విచారింప బోయి వానిని జూచి అబ్బాయి, నీవీ రోగముచే చచ్చినట్టయిన నీ యాత్మ నేస్థలమునకు పోయి యుండునది నీకే వచ్చి మాతో చెప్పుమని చెప్పి లేచిపోయిరి. అలాగుననే యాదొర చచ్చి ముప్పది దినములు గడచినపిమ్మట వాని యాత్మము మేత్రాణులకు కనిపించి నా యహంకారముచేత నా రవ కల్పనకు విరోధముగా చేసిన పాపములచేతను నేనిప్పుడు నరకమున బడియున్నాను. అయినను దేవరవారి నొకటిమాత్ర మడుగుచు న్నాను. అదేమనగ: నేను చచ్చి యిప్పటి కెన్ని సంవత్సరము లాయె నని యడిగెను. అందులకు మేత్రాణులవారు నీవు క్రమించి ముప్పది నాళ్లుమాత్ర మాయెనని చెప్పిరి. అపుడు వాడీ ముప్పదినాళ్లలోగా దుర్భర నరకమున బడిన వారలను చూచిన, నెడతెగక జడివాన కురిసినట్టే లెక్కకు రానివారలు నరకములో పడుట జూచి లోకము ము గియుకాలము వచ్చినదని తలంచి యుంటినే యయ్యయ్యో యని య రచి వెంటనే మహా కఠోర నరక పాతాళములో పడెను.

ఓరీ పాపాత్ముడా, మేము చెప్పినది వింటివా! విన్నది చాలదా! మా సంరక్షకమైన మా యమ్మలు నీ హృదయమందు నాటలేదా? నీ పాపమార్గము విడువవా, ఇకనైన నీ మంకు భ్రమ చాలించవా, ఇది గో నీవలెనే లెక్కలేని జనము నిత్య నరకాగ్నిలో దినదినము వేన వే లుగ పడి యెన్నటెన్నటికిని కాలుచున్నారని వింటివికదా. ఇకనైనను నీవు నరకములో బడకుండ నిశ్చయించికొని పాపమును వర్జించి దివ్య

కర్తను సేవించి యుత్తమ పుణ్యక్రియలలో ప్రవర్తింప నిదియే తగిన కాలము! లేనట్టయిన ననేకులు తలంపని సమయమున నరకములో పడలాగున నీవును నరకములో పడుదువు. హెచ్చరిక సుమా.

## అయిదవ వ్యాఖ్యానము.

### ప్రపంచపు చెల్వములయొక్క అల్పతనము.

నరకము వేదనలు కఠోరములనియు నిత్యములనియు నట్టి యాజ్ఞలకు లోపడరాదనియు అందులో పడక తప్పించుకొను తెరగేదనియు జ్ఞానవివేకముల చేత తెలిసికొనుట ప్రతి మనుష్యునియొక్క కర్తవ్యధర్మము. అట్టి జ్ఞానమార్గమేమన: సకల పాపక్రమములను వర్జించి మంచి పాపసంకీర్తనముచేత తన యాత్మను శుద్ధీకరించుకొని పొగవలె మన్నైపోయెడి ప్రపంచపు మేలుల నాశింపక, యేక దేవునిమాత్రమే వెదకి వారి చిత్తముచొప్పున నడచుటే సత్యమార్గమని యెరుగుము.

లోకముయొక్క యల్ప మేలులకు మూలమగు బంగారు వెండి ముత్యములు నవరత్నములు పట్టు జవ్వాజి పునుగు కస్తూరి మొదలగు వానిని సంపాదించినవారలకు బహు వైభవములు రాజ్య పరిపాలనము సంప్రాప్తమవుననియు, చెలువగు స్త్రీభోగములు తక్కువగాకుండ గలుగుననియు, ప్రతాప మహిమ లోనగూడుననియు తలంచిన లౌకిక మనుష్యులు ద్రవ్యములనే వెదకుచు పాటుబడుచున్నారు గాని సద్గతికి మార్గమైన సుకృత పుణ్యములను వెదకుటలేదు. అయ్యో, ఇటువంటి ప్రపంచపు మేలులు ఎన్నాళ్లు నిలుచును?

వేదవాక్యముచొప్పున నీలోకపు మేలులన్నియు వ్యర్థములలో వ్యర్థమును, నీడలలో నీడయునై యున్నవి. అదెటువలెననగ, ప్రపంచపు మేలులన్నిటి నొక్కొక్కటిగా విడదీసి విచారించినట్టయిన, ద్రవ్యసంపాద్యము కలిగి స్త్రీభోగమునందు సుఖించుటయు, ప్రతాపముతో వర్తించి కీర్తి బహుమానములతో గర్వించుటయు, మహారాజై లోక సుఖభోగముల ననుభవించుటయు నిమిషమాత్రములైన నీడలే గదా! ఇదిగో విచారించి చూడగా వీనిలో నొక్కటైనను నేటయిన

భాగ్యమై నిలుచుచున్నదా?

ఎందుకనగ బంగారు వెండి మొదలగునవన్నియు మంటిలో బుట్టినవేగదా. వెల హెచ్చయిన పునుగు జవ్వాజి కస్తూరిలోనగు వాసన వస్తువులన్నియు మృగముల యశుద్ధపదార్థములేగదా. పట్టుపటావళులన్నియు నేత పురుగుల నార రోతగదా. ఇదిగో వీనిలో నేమైన భాగ్యము కలదా? రోతయైన యీ ప్రపంచపు మేలు లనుభవించు వానికి మనశ్చింతలు తీరక సుఖములో సహితము నానా సంకటములు తటస్థించుచున్నవి. ద్రవ్యములలో వంచనయు, వీరశూరత్వములో నలవును, స్త్రీ భోగములలో వెగటును చెడ్డవ్యాధులును, గలుగునుగదా. ప్రపంచ సుఖభోగము లెంత కెంత యధికరించునో యంతకంత మనశ్చాంచల్యమును బుద్ధిమాంద్యమును ఆత్మకు నష్టమును కలిగించుననుటకు సందేహము లేదు.

ఓరీ పాతకుడా, ఇటువంటి రోతయైన సుఖభోగములకా నిత్య పరమగతిని మరచి తిరుగుచున్నావు? మంటి మూటకా న్యాయమైన మార్గమునుండి తొలగి దూరముగా పోవుచున్నావు? మృగములనుండి వచ్చు నశుద్ధపదార్థమునకా నీయాత్మను నిత్య నరకములో పడద్రోయుచున్నావు? ఈ నీచపు గంపుతో గూడిన మోహ సుఖమునకా నిత్యానంద పదవిని దారబోసికొనుచున్నావు? ఈ మాయ సుఖములకా నడక వరుగులనక రాత్రి పగలనక పాప పుణ్యములని విచారింపక యగచాట్లు పడుచున్నావు? ఇదిగో అనుదినమును ఈ మాయలోకపు చెల్వములన్ని ఇహపరములను పొందనీక మోసగించెడు ఘాతుకములని వినలేదా?

ఇదిగో ఒక రాజు బహు భంగుల మోహ సుఖము లనుభవించుచు తన రాజ్యము నేలుచుండగా వాని ప్రజలు గుమిగూడి వచ్చి వానిని పట్టుకొని పెద్ద దెబ్బలు గొట్టి నేల పడదన్ని చేయరాని యక్రమ కృత్యములు చేసి రెండు చేతులు తెగనరికి వీధి వీధి నీడ్చుచు త్రిప్పిన పిదప కాటికి తీసికొనిపోయి వాని తల నరికి పార వేసివచ్చిరి. కలుషాత్ముడా! కంటివా, లోకపు మేలులలో సుఖమెక్కడ? స్థిర మెక్కడ?

వర్వము మాయగదా.

ఈలాగుననే మరియొక దళాధిపతి యనేక దేశములను జయించి తన వశపరచుకొని మహా వైభవముతో రాజ్యమేలుచుండగనే మహా విపత్తులో చిక్కి తానున్న పట్టణముననే రెండుకన్నులను పీకించుకొని జయించిన సీమలన్నియు మరల పోగొట్టుకొని పరదేశమునకు బోయి భిక్షమెత్తుకొని దరిద్రుడుగా పడి చచ్చెను. వింటివిగదా, ఈలోకములో పరాక్రమశాలియై యున్నవాని చెల్వాగు సుఖములు ముగిసిన గతి హెచ్చరిక సుమా.

మరియొక రాజు తన రాజ్యము దారబోసికొని కీర్తి గౌరవములను పోగొట్టుకొని కడకు చిన్నవాండ్రకు చదువు చెప్పుటకాక బడి కట్టుకొని మరణపర్యంత మట్లే కాలము పుచ్చి శ్రమించెను. కంటివా, ప్రపంచ విలాసము లనిత్యములు.

ఇంకొక మహారాజు డెబ్బది రాజ్యములను జయించి దళలుడై యుండెను. తుద కొక ధూర్తుని చేజిక్కి రెండు చేతులు నరికించుకొని వాని గులామై యుండి మిక్కిలి దీనదశలో గతించెను. ఓ ప్రపంచపు మరులలో దగులుకొన్నవాడా, మహా ఘనమని గణించి సంపాదింపవలెనని నీవు ప్రాకులాడి వెదకెడు లౌకిక భాగ్యములయొక్క యనిత్యత్వమునుగూర్చి వింటివికదా. ఇట్టి ప్రపంచపు చెల్వములను బుద్ధిమంతులు నమ్మకొందురా? నిత్యానంద పదవియైన మోక్షము నొసగెడు పరమకర్తను సేవించుటయు, వారి చిత్తముచొప్పున నడుచుటయు శాశ్వతమైన భాగ్యమిచ్చునుగాని యితరములన్నియు నీడవలె నిమిషమైన నిలువక పోవుననుట వాస్తవము.

ఓ భాగ్యదాముడా, ప్రపంచపు టల్ప భాగ్యములమీద నీకుగల వట్టి వదలుట కిది చాలదా? ఇంకను జెప్పెద వినుము. విజయనగరపట్టణములో ననేక రాజ్యముల కధిపతియై యుండిన వేంకటపతి యనురాజు అఖండ నరేంద్రు డనిపించుకొని లెక్కలేని దళములను గూర్చుకొని మహా సౌర్యముతో పోరాడి యనేక రాజులను జయించి పట్టిన కార్యమును నెరవేర్చుకొనుచు, తన ప్రజలను రక్షించుకొనుచు బ్రహ్మాండ

మైన తురకల దండును సంహరించి వీరులకు వీరుడైన పగవాని తల తెగనరికి పెక్కు శౌర్యప్రబిరుదులను కొనినవాడును, సముద్రవిభు డనిపించుకొని యేనుగలను సహితము పట్టి మర్దించునంతటి బలశాలియై మహా వైభవముతో లోకైకాధిపతి తానే యని చెప్పుకొనుచున్నవాడును, కడకు రాజ్యము పోగొట్టుకొని గౌరవములు గోలుపోయి పట్టణమునుండి వెళ్లగొట్టబడి మహా దుఃఖమునొంది పరదేశిగాపడి చచ్చెను. ఈలోకములోని మాయమగు సుఖభోగములను నమ్మినవానికి వచ్చిన గతి చూచితివా?

అనేక సైన్యములను జయించిన యొకానొక మహా రాజు భార్య మిగుల రూపవతియై యుండెను. ఆమె మంత్రులలో మహా సౌందర్యముగల నొకని మోహించి వాని జేర పిలువగా వాడు కాదనడం దువలన నామె మహా కోపపు వెఱ్ఱితో శుద్ధవిగకు డైన యా మంత్రిని చంపింప నెంచి రాజు దగ్గరకు వచ్చి: ఇదిగో ఆ దుష్ట మంత్రి నన్ను కౌగిలింప వచ్చెనని చాడి చెప్పగా, రాజుగ్రకోపముగలవాడై యా మంత్రిని రావించి తల నరికించెను. ఆ మంత్రి భార్య తన మగని శిరస్సు చేత బట్టుకొని రాజు ముందర దానిని విసిరివేసి; ఇదిగో నా యమగు పెనిమిటి తల నరికించినది మీరేకదా? అయిన నాయనమీద మోపిన నేరమేమి? శిక్షా కారణ మెక్కడ? మీరు మోపిన నేరము వట్టి యబద్ధమని నేనిప్పుడే చూపుదును. ఆ నేరమును దాని కారణము నొప్పించువారు గలరేని ముందుకు రావచ్చుననుచు కాలిన యినుపముద్దను చేత నెత్తుకొనెను. దాని చేయి కాలకుండుట రాయడు చూచి తన భార్యమీదనే నేరమున్నదని యెంచి దానిని పిలువనంపించి విచారణ చేసి దానిపైన నేరము మోపి దానిని సేవకుల చేతి కొప్పగించి మహాపమానముగా వీధి వీధిని త్రిప్పి దెబ్బలు కొట్టించి మండెడు నావములో వేసి కాల్చి వేయుడనెను. ఓరి పాపి కంటివా! రోతయైన పాపసుఖమునకు వచ్చిన నరకాజ్ఞ! ఎంత భయంకరము! కంపుగొట్టు పాపమునకుగాను నరకమున బడు మనుష్యు లెందరో చూచితివా! లోకాశలకు లోనై నీ యాత్మను చెరచుకొని కలంతకాల

మనంతమైన నరకమున పడెదవా?

ఎఫెజసను పట్టణమున మహా సుఖముగా సంచరించుచుండిన దంపతులిద్ద రెడబాయుని స్నేహములో నున్నపట్ల పురుషుడు మరణించెను. భార్యకూడ వానితోడ చావవలెనని తెగించి వానిని పూడ్చిన సమాధి ముంకర పడి యన్నాహారములు మాని చావ నిశ్చయించి రాత్రింబగళ్లెడతెగక యేడ్చుచుండెను. అచ్చటికి సమీపములోనే యొక దొంగ నురివేసి చంపి వాని ప్రేతము నెవరును దొంగలించుకొని పోకుండ నొక బంట్రౌతును కావలియుంచిరి. ఆ స్త్రీ యేడ్పు ధ్వని విని కావలివాడా పెదగ్గరకు వచ్చి లలితవాక్యములతో పలుకరించుచు దాని దల దడివి దాని దుఃఖము పోగొట్టి యాకలి దప్పులు తీర్ప నన్నోదకము లిచ్చి దాని మనస్సుకు స్వస్థిల్లనూరట చెప్పి లాలించి కడకు పాపము చేయ నొప్పించి చాలసేపామెతో కాలము గడుపుచుండగ వాని బంధువులు వచ్చి దొంగయొక్క ప్రేతము నెత్తుకపోయిరి. తరువాత నా సేవకుడు వచ్చి ప్రేతమును కానక మహా రోదనతో నా స్త్రీ యొద్దకు వచ్చి మొరపెట్టగా, నామె వానిని జూచి: మంచిది, నీ వెందుకును జడియవలదు, నేనే నీ కొరకు జవాబు చెప్పెదను, ఇదిగో నా పురుషుని ప్రేతము నా సమాధినుండి బైటికి తీసి యెత్తుకొని పోయి యా యురిగాలమున కెక్కింతము రండి యని చెప్ప, నా యిద్దరును సమాధి త్రవ్వి తెరచి యామె పురుషుని శవము నెత్తుకొని పోయి గాలమున వ్రేలాడ వేసి యన్యోన్యులై సుఖముగ నుండిరి.

ఓరీ పాపీ, లోక సుఖముల స్థిరమనియు లోకుల దుష్టత్వము దురంతమనియు దెలిసెనా? అనిత్య మాయభోగములను నమ్మవలదు. ఆశింపనువలదు! ఈ మాయ చెల్వములను నమ్మి వానిపై మనస్సుంచి నిత్య నరకమునకు పోవలెనని యేల యట్లూగెదవు? నిశ్చలత నొందుము. ఈ రీతిగా నిత్యానంద మోక్షమునకు గొనిపోయెడు మార్గము విడిచి నరకమార్గమున నడచెదవు? ఓరీ భ్రమ పట్టినవాడా, ఇదిగో యీ ప్రపంచ సుఖభోగములన్నియు నీలాగున మాయకొల్పి మనుష్యుని యాత్మను చెరది పరమగతి మార్గము చేరకుండ నాటంకపరచుచు

న్నవని యెరుంగుము. తెలిసి యికనైనను బుద్ధి తెచ్చుకొని యీలోక మేలుల నాశింపక పాపమార్గము బొత్తిగా విడిచిపెట్టి పుణ్యపుద్రోవలో సూటిగా నడువుము.

## ఆరవ వ్యాఖ్యానము.

### మనుష్యునియొక్క యునికి.

ప్రపంచ సుఖభోగము లనిత్య సుఖములని యెరిగినపుడే, వానిననుభవించెడు మనుష్యుని యునికియు తోడనే యెరుగవలసియున్నది. రెండు మూరల శరీరము ధరించి హీన బలములతో వర్ధిల్లి మృగమువలె జీవించి పురుగులకు పుట్టలై జల మలముల గుంటయయి చంచల రూపియై అలమట్లకు గురియై భయపడు స్వభావముగలవాడునై సకల రోగములు, చలి బాధలు మల జలములు నిండు శరీరము కలవాడునై మరణమునకు దాసుడునై కాలము పుచ్చెడివాడు మనుష్యుడని నీ వెరుగగలవాడవు.

ఇట్టి శరీరము కలిగి కొన్నాళ్లు సౌందర్యముతో నిగ నిగలాడుచున్నాడు. రాగా రాగా నవలక్షణ రూపియై. ముఖము ముడతలు బారి కన్నులు గుంటలు పడి, పండ్లూడి బోసి నోరుగలవాడై, వీపు వంగి గూనియై వణకు బట్టతలతో నోట గళ్లలును ముక్కున చీమిడియు పడుచుండ చెవిటివాడై చేతులు కాళ్లు ఉడరి వంగివంగి నడచుచు మనస్సున చంచలుడై, ముదిమిబాధలతో కడకు మృత్యువువాత బడును. నరునిగూర్చి విచారించిన మునీశ్వరయ్యలు చాటించినదేమన: మనుష్యులు గంభీరమైన బురదకుప్పయనియు పెరిగెడి దూళియనియు కమ్ముకొనియుండు బూడిదయనియు క్షణములో దాటిపోయెడు ప్రకాశలేశమనియు తోడనే వాడిపోయెడు గట్టి పువ్వుమనియు నిమిషమైన నిలువని తాపస్వభావమనియు వచించిరి. ఓరి నీచమనుష్యా! నీ శరీరముయొక్క యందము వ్యర్థము. ఇట్టి శరీరమునకా చెడని యాత్మమును నరకమున త్రోసెదవు? ఈ కంపు శరీరము కొరకమా నిత్యానందపదవిని పాడుచేసికొనెదవు?

నీ శరీరమున కిట్టి విపరీత వికారములు కలిగియుండుటగాకుండ నీ గుణగతములకును నానా విధ దుష్టత్వములు కలుగును. మనుష్యుడు కోపగించుకొనుచున్నాడు, ద్వేషించుచున్నాడు, నిందించుచున్నాడు, చెరచుచున్నాడు. చెరచుటను వంచించుటను దాపరికము చేయుచున్నాడు. అన్యాయములు దొంగతనములు పిల్లిశూన్యములు చేయుటయు విషములు త్రాగించుటయు హత్య మాయజిత్తులు మోసపు ఘాతుకములు అహంకారపు హెచ్చులు మొదలగు దుర్గుణములు పొందుచున్నాడు. రోమాపురి చక్రవర్తియగు నెరో యనువాడు వ్యర్థ సుఖము నిమిత్తమై కన్న తల్లిని చంపివేసెను. రోమాపురమున కగ్ని యంటించుమని చెప్పి యది మండుచుండు సమయమున తా నున్నతమైన గోపురముపై కూర్చుండుకొని సంగీతపుపాటలు పాడుచుండెను. దుష్టుడగు హెరోదురాజు రాజ్యకాంక్షచే లెక్కలేని పసిబిడ్డలను వధింపజేసెను.

అస్సుయేరుడను రాజుయొక్క మంత్రి యమానను వాడు రాజు వాకిట గాచియుండెడు వారలలో మర్దోకేయుడను వాడు మాత్రము తన్ను చూచి లేవకయు ఆచార మర్యాదలు చేయకయు నుండుట చూచి యది సహింపజాలక వానిని తూకుమ్రానిలో వ్రేలవేయ రాజాజ్ఞ గోరెను. రాజు సమాచారము విని విచారించి నిజము గ్రహించి వాని దురహంకారమునకు మంత్రినే వాడేర్పరిచికొనిన యురి మానిలో నురిదీయ నాజ్ఞ యిచ్చెను.

ఇదియునుగాక, తన్ను కన్న తండ్రి యని చూడక తండ్రి రాజ్యమును తానే యపహరింపవలెనని దండెత్తి యతనిని రాజధానిపట్టణమెల్ల దరిమి తానే రాజరికించుకొని కొన్నాళ్లు నేలుచుండుపట్ల మరొక దండు తన మీదికి వచ్చుట గని దానిని జయింపబోయిన చోట తన దండోడి పారిపోవునపు డొక మ్రానికొమ్మలో తల వెండ్రుకలు తగులుకొనగా నందు జిక్కి వ్రేలాడుచుండ మూడీటెపోటులతో ప్రాణము విడిచిన వానిని నీ వెరుగవా? అంతట దావీదురాజుయొక్క సుందర సుకుమారుడగు కుమారుడు అబ్సాలోముడనువాడు కోపముచే

వెంజెస్లాసను రాజు కత్తి దూసి యొకనిని నరుకుటకై పరుగెత్తిరాగా వాడా వేటు తప్పించుకొని పారిపోవుట చూచి వెఱ్ఱి కోపము మిక్కుటముగాగ తానే క్రింద పడి చచ్చెను.

ఓరీ స్వల్ప మనుజుడా! వింటివా. ఇవ్విధమున దుర్గుణములు మనుష్యుల యందు దూరి వెడలుచు పరుల చెరచుట యనుదినము చూచుచు వచ్చుచుండియు నిటువంటి హీనమనుష్యుల నేస్తమును బాంధవ్యమును సహాయమును స్థిరమైన యాశ్రయమని నమ్మి పరమకర్తను మరచి యాయనయొక్క సహాయమునెడు ఇష్టప్రసాదమును నిత్యానంద మోక్షరాజ్యమును వెతకక యనేకులు నానా దుర్మార్గములలో తిరిగెదరు! ఈ యనిత్యలోకపు చెల్వములను నమ్ముకొని నిత్య సౌందర్యము గల తమ యాత్మలను చెరచికొని యారని యగ్ని నరకములో త్రోయుచున్నారు. అయిన నీ లోకముయొక్క యల్ప సుఖమును, త్రగ్గిపోయెడు శరీర సౌందర్యమును, నాలుగునాళ్లుమాత్రమే నిలుచునవని యెరుగవా? ఓరి యల్పమనుజుడా! మూడు నాళ్లలో చూడకూడని కంపు బట్టి యసహ్యమయ్యెడు నీ శరీరముకొరకు నీ యాత్మను నరకమున త్రోయుట న్యాయమా? ఇదిగో దుర్గంధమైన మలమూత్ర రక్త మాంసములతో నిండిన శరీరమును నమ్మక పుణ్యమార్గములో నడుచుటకు నిది చాలకపోయిన నింకను చెప్పెదను వినుము.

ఒకానొక మనుష్యుడొకనాడు వనమున మిక్కిలి యవసరముగా పోవుచుండునప్పుడొక దుష్టమృగ మెదురుపడి వానిని వెరపింపగ, వాడు భయపడి పరుగెత్తెను నవసరమున నొక గుంటలో దొల్లిపడెను. ఆ గుంటయొక్క దరిని బలిసిన పెద్దమ్రాకు కొమ్మలలో చిక్కుకొన్నందున నతడు గుంట యడుగున బడక దాని కొమ్మలను బట్టుకొని పైకెక్కి యొక కొమ్మమీద కూర్చుండుకొని క్రిందికి చూడగా తరుముకొని వచ్చిన దుష్టమృగము వానిని పట్టి తినుటకై మ్రాను క్రిందనే పొంచుకొని యతడెప్పుడెప్పుడు పడునా యని యెదురు చూచుచుండెను. కొమ్మలపై నున్నవాడు మ్రాని యడుగున జూడగా, నల్లయెలుక తెల్లయెలుక రెండు నా మ్రాని వేరులు తెగ గొరుకుచుండెను.

అది చూచి: అయ్యో! యీ ద్రాను కొంతసేపటికే పడిపోవునుగదా యనుకొని యందుండి తప్పించుకొని పోవుటకై ద్రాని యంచున గు బురుగా నున్న పొదవైపు చూడగ నాలుగు పాములా పొదమీద నుండుకొని వాడు రాకుండ బుస్సుమని బుసపెట్టుచు కరవ వచ్చుట యు వాడు కొనకొమ్మలకైన నెక్కిపోదమని తిరుగ చెట్టెక్కగా నొక కొమ్మలో నొక యీగనుండి కొంచెము కొంచెముగా తేనె పడు ట చూచెను. ఆ తేనె బొట్లు నాలుకపై నిడికొనగా బహు తీపుగా నుండెను. బొట్టు బొట్టుగా పడుచుండిన యీ తేనెను చేతిలో పట్టుకొని నాకుకొనుచు తాను పడెడు నవస్థను తప్పించుకొనవలెనను బుద్ధితో డనే మరచిపోయెను. వాడు పరాకుతో నుండ నా రెండెలుకలు ద్రాని వేళ్లన్నియు తెగకొరికినందువల్ల ద్రాను పెళ పెళ విరిగి పడ గానే వాడు గుంటలో బడెను. పడినతోడనే యక్కడ పొంచుకొని యున్న దుష్టమృగము వానిని తన వాత వేసికొనెను.

ఓరీ యుదర పోషకుడా! దీని యర్థము తెలిసికొంటివా? ఇదిగో, ఆ బుద్ధిలేని వానివలెనే యనేకులు భూలోకమున తిరిగెదరు. మనుష్యు లు తల్లిగర్భమునుండి బయలు వెడలినది మొదలు దుర్మరణము వె న్నంటి వెరపించుచున్నది. జీవమనెడు ద్రానియొక్క యాధారమున మనుష్యుడు కొన్నాళ్ళు ప్రపంచమున నుండగ, పుట్టిన శరీరములోనే విషసర్పములవలె నాలుగు భూతము లొకటికొకటి విరోధించి శరీర మును చెరచి నాశనము చేయ యత్నించుచు నిత్యము మనుష్యులకు విఘ్నము గావించుచున్నవి. నల్ల తెల్ల యెలుకలనెడు రాత్రిపగలు దిన మై, దినములు మాసములై. మాసములు వర్షములై, గడిచిపోవుచు మను ష్యునియొక్క యాయుస్సు క్రుంగించుచున్నది. కడకు మరణము వచ్చి నేల పడవేసిన వెనుక, దుష్టమృగములవలె నుండెడు పిశాచులు వా నిని పట్టి నరకపుగుంటలోని కీడ్చుకొని పోవుచున్నవి. ఓరీ పాపాత్ము డా, ఈలాగున నిన్ను జుట్టుకొని యుండెడు మోసపు చెట్లు మరచి, యవి తప్పించుకొను మార్గమగు పరమపదవి ద్రోవ విచారింపక యొక బొట్టు తేనెవలె నుండెడు నీ ప్రపంచ సుఖ భోగములకు నాశ

పడుచున్నావు. ఈ యల్ప సుఖములు ముగియుటయు, జీవశక్తి తరుగుటయు, మరణము వచ్చుటయు, తలంపక నీ శరీర సౌందర్యమును మోసపుచ్చెడి యీ లోకపు సుఖభోగములను నమ్మి తిరిగితివా, యిదిగో తేనెబొట్టు కాశించి దుష్ట మృగములచే జిక్కినవానివలెనే, నీవును లోక సుఖభోగములలో సుఖించుచు నున్నట్లుండి ప్రాణములు విడిచి మరణించినతోడనే నరక పాతాళమందుండు పిశాచములచేత బడి, యెన్నటెన్నటికి తీరని నిత్యనరకమున నగ్ని బాధ లనుభవించెదవు. పరమపదము నొంద మనస్సుగలవాడివ్విధమున నీ లోకసుఖభోగములను నమ్మినట్లయిన, నట్టి మోసము తనకును వచ్చునని గ్రహించి మరణము వచ్చుటకు మునుపే వానిని వర్జించి నిత్యజీవమును చెడని మోక్షభాగ్యము నిచ్చు పరమకర్తను మాత్రము నెరనమ్మి సేవించి స్తుతించి వారు కట్టడజేసిన వేదకల్పనల ప్రకారముగ మరణపర్యంతము నడుచుకొనునని యెరుగుము.

## ఏడవ వ్యాఖ్యానము.

### మరణముయొక్క విపరీతము.

గుఱ్ఱముకన్న బహు వేగముగ నురికెడు కాలములో మనుష్యుడు జీవించెడు కాలమంతయు చూచినట్లయిన నొక్క క్షణమాత్రముకూడ లేదని చెప్పబడుచున్నది. ఇదిగో వర్తమాన కాలము తన క్రియలన్ని నెరవేర్చుకొనిన తోడనే గతించిన కాలమైపోవును. పోయిన కాలము తిరుగ రాదు. మరియు భవిష్యత్కాలములో నొకరు ప్రాణములో నుందునో లేదో సందేహము కదా? అందువల్లనే లోకములో జీవించెడు మనుష్యుడొక క్షణము మాత్రమే బ్రతుకునని చెప్పవలెను. ఈ కొంచెపు కాలమును ప్రపంచ సుఖభోగములలో వ్యర్థము చేసినయెడల పుణ్యక్రియల చేసి పరమగతి పొందుటకు కాలమెక్కడ? ఓరీ మనుష్యుడా! ఈలాగున లోకమున జీవించెడు మనుష్యుడు బ్రతుకు నాళ్లన్నియు నొక క్షణముగా నుండగా, నీ లెక్కలో పెక్కేండ్లుగ గణించుకొనినను, ఒక క్షణములోనే నీవును మరణము

పొందెదవు. మరణము పొందక మునుపే ఈ కొంచెపు కాలములో పుణ్యమార్గము వెతకినట్టయిన, నిత్యానంద మోక్షరాజ్యమున సుఖముగ నుందువు. ప్రపంచమును నమ్మి పాపపు త్రోవలో నడచితివేని చచ్చినతోడనే నరక పాతాళమున పడెదవు.

మరణమును తప్పించుకొనుమనని నిశ్చయముగా చెప్పగలవాడెవడు? ఎప్పుడో యొక్క దినము చచ్చుట దిట్టమైనను, తనకు నేడో రేపో యెవ్వరెరుగరు. అయినను మరణము రాకన్నట్టుగా క్షణకాలము మాత్రము జీవించెడు మనుష్యుడు దీర్ఘాయుష్షుగల వానివలె పుణ్యపు త్రోవను మరచి మరణమునకు వెరవక తిరిగి పాపముచేయును. అప్పుడు తటాలున దుర్మరణమువచ్చి, వాడు జీవించిన కాలమంతయు ఒక్క క్షణమువలె గతించి పోయెననియు, ఆ క్షణకాలములో ననిత్యమైన ప్రపంచ సుఖములను నమ్మినందుకు నిత్య నరకమే ప్రాప్తించెననియు, ఈ లోకమున పాపమార్గమున జీవించిన కాలమంత పడిన ప్రయాసయంతయు వ్యర్థమనియు తెలియజేయును.

ఓరి మనుష్యుడా! సాలెపురుగు తన కెరయగు ఈగలను పట్టుటకు తన శరీరములోనుండి నూలు నూలుగా నొక ద్రవము వెలువరించి, యీగలు పారాడెడు త్రోవలో నొక వలగా నల్లి, బహు ప్రయాసతో ఈగలకొరకు పొంచి కాచియుండ, నొక స్త్రీ సాలెపురుగుయొక్క వలను కని పొరకతో కొట్టి యూడ్చిపోవును. అదిగో సాలెపురుగు వల వేయుటకు పట్టిన కాలమును దిగుటయు నెక్కుటయు దాటుటయు చుట్టుటయు పారాటమును నొక్క పొరక వేటున వ్యర్థమై పోయెను కదా! అలాగే నీవును ప్రపంచపు సుఖముల ననుభవింపవలెనని ప్రయాసపడుచు కాలము గడుపుచు, లోకమున గొప్పవాడనగుదును, జయించి యేలుదును, మహారాజనై సుఖమున నుందును, అందుకై దండుగట్టి ద్రవ్యము సంపాదించెదను, సకల సుఖభోగములన్ని యనుభవించుదుననుకొనుచున్నావు. అయినను సుఖమును ద్రవ్యమును ననుభవింపక ముందరనే దుర్మరణ మదిరిపాటున వచ్చి, నీవు తలంచిన తలంపులన్ని నాశనము చేసి, నీవు లోకసుఖములకై దురాశలచే చేసిన

నానా పాపములకు శిక్షగా నిన్ను నరకములో త్రొక్కివేతును.

ఓరీ పాపాత్ముడా, ఇందుకు తగిన తార్కాణముగా నారంభించిన కార్యము ముగింపక చచ్చినవారి కథలను చెప్పెదను వినుము. ఓలో ఫెర్నెసుడను సేనాధిపతి బెతూలియా యను పట్టణము జయించి పట్టుకొని దానిని యేలవలెనని బ్రహ్మాండమైన దండుగూర్చి పట్టణమునకు ముట్టడి వేసియుండు సమయమున, ఆ పట్టణములో నుండిన యొక పుణ్యస్త్రీ తానున్న యూరు పరుని చేతిలో పట్టుబడరాదనియు, ఆ దళకర్తను నరికివేసెదననియు తెగించి, పట్టణము విడిచి వెళ్లి దళకర్త దగ్గరకు వచ్చి లలిత వార్తలతో వానిని లాలించి యర్ధరాత్రి ప్రొద్దున సందరును నిద్రించు సమయమున వాని తల నరికి యెవ్వరికిని కనబడకుండ తన పట్టణమునకు వచ్చెను. ప్రొద్దుననే వాని దళమంతయు తన కర్త నిర్భాగ్యముగా చచ్చి పడియుండు టెరిగి తోడనే బుద్ధి కలంగి బెదరి తత్తరపడి చెదరి పారిపోయి యపజయము నొందెను. అయ్యో పాపాత్ముడా, ఈలాగునకదా నిన్ను వెన్నంటి యుండెడు దుర్మరణము నీవు తలంచని కాలమునను, నీవు కట్టు నిల్లు ముగియక ముందరను, నీవు పెట్టిన పంట ననుభవింపక ముందరను, తలంచిన కార్యము తీరక ముందరను, ఇచ్ఛించినవి యీడేరక ముందరను సంపాదించిన సొమ్ములు వెచ్చము చేయక ముందరను, నీ జీవము నీడ్చుకొని పోవునది నీ వెరుగవా?

అంతియోక్యుడను పరాక్రమశాలి యనేక పట్టణములను జయించి తన వశము చేసికొని, యొడ్డోలగముగా నట్టహాసముతో దిరుగుచుట్టిన సీమలును ఏలెడు పట్టణములును తనకు చాలవని, యింక ననేక రాజ్యములను జయించి యేలవలెనని యాలోచన చేయుచుండగ వాడు వ్యాధిపీడితుడై పురుగులు పట్టి చచ్చెను. ఓరీ పాపీ! ఈలాగున తలంచిన కార్యము ముగింపక ముందరనే మనుష్యులకు మరణము వచ్చెడు విధము చూచితివా? అట్లు మరణకాల మెప్పుడైనది యెవరెరుగుదురు? మరణమునకు ముందరనే నీ పాపపు ద్రోవను విడిచి పరమగతి పొందుటకు పుణ్యములను చేయవలెను. ఈ మాయాప్రపంచపు

మేలులను నీ శరీరారోగ్యమును నమ్మి తిరిగితివేని, ఆత్మకు వచ్చెడు భయంకరమైన చేటు వచ్చును.

ఇదిగో ఒక ధనాఢ్యుడపార ద్రవ్యమును సంపాదించి దానిని సుఖముగా ననుభవింపవచ్చునని తలంచుకొని యుండునప్పుడు, మహా కఠినమైన వ్యాధిచేత మంచమున పడి, తాను సంపాదించిన ద్రవ్యముల ననుభవింపక ముందరగానే మరణము తన్ను గుంటకు నీడ్చుకొనిపోవ వచ్చునని తన ద్రవ్యములన్నిటిని దెచ్చి తన ముందర బెట్టించుకొని వానిని జూచి చింతించుచు: నా ద్రవ్యమా, నిన్ను విడిచి పోవుచున్నాను; మరణమా, నా ప్రాణమును కొనిపోవలదు; నా ప్రాణమా, యీ ద్రవ్యమంత నీకు గదా సంపాదించితిని; దీని ననుభవింపక ముందరనే నన్ను విడిచి పోవలయునా? మరణమును తడకట్టుటకు తెగింపలేవా? ఈ ద్రవ్యములన్నిటిని నీకొరకు గదా కూర్చితినని ప్రలాపించుచుండగానే వ్యాధి పైగొని ప్రాణాపాయము రాగా నతడనిన దేమన: నా జీవమా, నన్ను నీవు చేయి విడచితివా? నిన్ను దుష్ట పిశాచుల చేతిలో నొప్పగించెదననుచు చనిపోయెను. చచ్చినవాని యాత్మను వెంటనే పిశాచులు నరక పాతాళమున కీడ్చుకొని పోయెను.

అయ్యయ్యో పాతకుడా, ప్రపంచపు సుఖములు నమ్మియుండిన వానికి వచ్చిన మోసము చూచితివి కదా. ఇకనైన నీ యనిత్యపు మాయలను నమ్మక నీ మరణమునకు ముందరనే నిత్యానంద మోక్షము గోరి పరమకర్తను సేవించి యాయన చిత్తముచొప్పున నడవగలవాడవు. అయినను నీవు గర్వపడి మరణము రాక మునుపే సుమార్గము వెతకక యుండుటెందుకు, మరణము వచ్చునప్పుడు పుణ్యము చేసెదనుగాని మరణమునకు ముందరనే పాపపు మార్గము విడువననుచున్నావు కాబోలు. జగడమం దాయుధము పట్టని బంటు జగడములో చచ్చునుగాని జయింప నేరడు. అలాగుననే మరణమునకు ముందు సుకృత మార్గములో నడువని వానికి పుణ్యమనెడి యాయుధము దొరకునా? దుష్ట పిశాచులతో నెదిరించి జయము గొనవలసిన సమయమునకు వెతకని దేవకటాక్షము మరణమప్పుడు పొందరాదు గనుక,

దుష్టపిశాచుల కోడిపోయి వానిచేజిక్కి నరకములో నిత్యకాలము పడబోవుట సిద్ధము.

ఈలాగున గదా యనిత్యలోక సౌఖ్యములను నమ్మియుండిన వాడొకడు మరణతరుణము వచ్చినపుడు తా నీడేరుటకు తగ్గ బుద్ధి విచారింపక మును పటివలెనే ప్రపంచకార్యములలో మనస్సుంచి తన దగ్గర నున్న వారలను జూచి: ఆ సరకునకు వెల యెంత? బేరములో వచ్చెడు లాభ మేమి? పండిన ధాన్య మెంత? ఊరిలో సంగతు లేమి యని నానా లోకకార్యములు విచారించుచుండెను శరీరమును విడిచిపోవు అతని యాత్మ కే గతి వచ్చునో యని తలంపక యున్నపుడు అకస్మాత్తుగా మరణము వచ్చి యతని యాత్మను నరక పాతాళమున పడవేసెను.

ఓ మతి చెడినవాడా. యీలాగున నరకమందు పడుటకా, మాయ లోకపు చెల్వములను సంపదలను గోరి వెదకుచున్నావు. ఈలాగున పరమగతిని పోగొట్టుకొనుటకా, సత్యమార్గము వెతకక యుండెదవు! ఇట్లు నీ యాత్మను నాశము చేయనా, మరణము కలదని విచారింపక దీర్ఘాయుస్సు గలవానివలె సృష్టికముతో తిరిగెదవు! ఓరీ గర్విష్టుడా, ఒక్క నెలలో దాను చచ్చునని తెలిసినవా డీలోకమును త్యజించి తప్పక పరమగతి చేరెడు మార్గములను లెస్స విచారించును గదా. నీకు నేడో రేపో యెన్నడో, యొక్క దినము మరణము వచ్చుట నీ వెరుగుదువుగదా. కాబట్టి నీవు మరణమునకు వెరచి మంచి మరణమునకు మరలనట్టయితే పరమగతిని పోగొట్టుకొని నీ యాత్మను నరక పాతాళమున పడద్రోసికొనెదవు. అట్లు పడక యుండునటు లీ దినమే మరణము వచ్చునని తలంచి పరమగతి గలిగించు పుణ్యకార్యముల జేయ నెరుగుదువుగాక.

# ఎనిమిదవ వ్యాఖ్యానము.

## మరణముయొక్క విశేషములు.

---

పరలోక భూలోకములను సృష్టించిన పరమకర్త యానతీయ నవధరించిన వేదవాక్యములు గొని తిరుసభ యందరికి నెరిగించున దేమన:

మంటిచేత కలిగిన మనుష్యుడా, నీవు తిరుగ మన్నయి పోయెదవని
తలంచుకొనుమని వినిపించుచున్నది. ఓరి మనుష్యుడా, యెండదెబ్బకు
మంచుగడ్డ కరగులాగున నీ శరీర సౌందర్యమంత మరణముచే నాశన
మగునని యెరుగగలవాడవు. రేపే పుచ్చి పురుగులుపట్టి చెడి మన్ను
తినిపోయెడి శరీరమున కాభరణములని యలంకారములని ద్రవ్యము
లని పెక్కు వస్తువులు వెతకి సంపాదించి, నగలను ధరింప నాతురపడు
చున్నావు. అయ్యో పాతకుడా, చెడని యాత్మ కొరకు మేలైనను నీవు
చేయుట లేదే! ఇదిగో, నేను పునుగు జవ్వాజులతో పరిమళించి నల
రాడేను శరీరము రేపే చెడి కంపుగొట్టును! ఈ మంటి కుండవంటి
కంపు శరీరమునకు మాత్రమే ఆయాసపడుచున్నావు. మరణము వచ్చి
నతోడనే నీ శరీరము కదలని కట్టెవలె బిగిసికొనును, చేతులు కాళ్లు
చల్లబడును, నాలుక పడిపోవును, ముఖము వాచును, శ్లేష్మము కట్టి
యూపిరి సన్నమై జీవ మెడబాసి పోవును. అట్టి సమయము మహా
భయంకరమైనది! బ్రతికియున్న కాలములో నీ శరీరమునకుగాను బహు
ప్రయాసపడినదంతయు నీ వప్పుడు వ్యర్థమని కనుగొందువు. జీవ మెడ
బాసినతోడనే నీ కాయము అవలక్షణమయి పుచ్చి కంపుబట్టి పురు
గుల పుట్టయై కడ కెండి మన్నయి పోవునని నీ వెరుగుదువుగాక.

అయ్యయ్యో పాపాత్ముడా, ఈలాగు పురుగుల పుట్టయై పోవు
టకు శరీరమును సుఖముగా పెంచెదవా? ఇట్లు కంపుగొట్టుటకు పును
గు జవ్వాజుల పూసి తళుకు జేసెదవా. ఇట్లు ధూళియై పోవుటకు మ
హాశతో శరీరమును మినుకు చేసి, చెడని యాత్మను మరచిపోవుచు
న్నావా. ఇటువంటి కష్టకాలము రాకముందరనే, స్థిరమైన మేళ్లుగా
నుండు పుణ్యముల వెతకుట యవసరము గదా. అట్లు వెతకిన యెడల,
శరీరము చెడిపోయినను నీ యాత్మయు పరమగతి నొందునని దృఢమై
న నమ్మకము కలుగును! కాలముండగనే పుణ్యమును వెతకక యు
న్నట్టయిన, మరణ తరుణమున శరీరము చెడి పురుగుల పాలగునట్లు,
నీ యాత్మ నరకపాతాళమున బడి నీచ పిశాచములచే బాధలు బడి కా
లిపోవుచున్నదని ప్రలాపించెదవు. అట్లు చావక ముందు సకల పాప

ములను విడిచి పుణ్యముల నాచరింప గట్టి ప్రతిజ్ఞ చేయుదువుగాక.

ఇవ్విధముననే యొక రాజకుమారుడు, తండ్రి చచ్చిన కొన్నాళ్లకు వాని ప్రేతమును చూడవలెనని సమాధి తెరిపించి, ప్రేతమును చూడగానే, శరీరము కంపుబట్టి, పురుగులు తొలుచుట చూచి, యొడలు జల్దరింప నయ్యో యని బోరున నేడ్చి, యెక్కిళ్లుబెట్టి: ఇదిగో యీ యవలక్షణపు పురుగుల కెరగా యగుటకు శరీరమును పెంచుట యెందుకు, ఈలాగున కంపుగొట్టుటకు పరిమళ వాసనలను పూయుట యేల, దుర్మరణము వానిని రాజని యెరిగి, ఘనముగా సన్మానించినదా? లేదుకదా. పరదేశికి వచ్చిన పాట్లే, వానికిని వచ్చెనుకదా. ఇట్టి దుర్మరణము రాకముందరనే, యాత్మను నిత్య పరమగతికి జేర్చుకొనుటే కార్యమని చెప్పి, రాజ్యమును సకల సుఖములను విడిచిపెట్టి, పరదేశియై తిరిగి మరణపర్యంతము పుణ్యపు త్రోవలో తప్పక నడిచి పరమగతికి చేరెను. ఓరి మనుష్యా, మరణమును తలంచినందువనే వానికి మంచి విచారము వచ్చినలాగున, నీకును వచ్చునట్లు మరణము దగ్గరించి వచ్చుచున్నదని తలంచికొనుచు సమయమున దగిన పుణ్యమును సంపాదింపుము. ఇప్పుడు వెతకని పుణ్యము మరణ సమయమునకు తటాలున వచ్చి, నీకు సహాయపడునని తలంపవలదు. హెచ్చరిక సుమా!

ఇదిగో ఒకానొక సేవకుడు పెక్కునాళ్లు తన రాజును సేవించి, కడకు మహా వ్యాధి రాగా, రాజు వానిని విచారింప వచ్చి వానిని జూచి: ఓరి భృత్యుడా, నీవు దిగులు పడవలదు, భయపడబోకు. నీకు నేనున్నాను. నీకు కావలసినది యడిగితే యిత్తునని చెప్పిన, నా సేవకుడు రాజును జూచి: అయ్యా, ఇదిగో నేను మిమ్ము ముప్పది యేండ్లనుండి సేవించితినికదా. దాసుని కిప్పుడు కావలసిన సహాయముల ననుగ్రహింప నవధరింపుడి. అందు మొదటిది, నా వ్యాధి కఠోరత కొంతసేపయినను శాంతిపడ చేయుట, రెండవది, మరణము నా జీవమును కొనిపోకుండ తడగట్టుట. ఈ రెండు చేయగూడనిచో నేను మరణము పొందినపు డలుపు దీర్చుకొనుట కొక మంచి స్థలమును నాకు

కరుణించుమని యనెను. మాటలు వినగానే రాజు దిమ్మరపోయి, వానిని జూచి: నీవడిగిన కార్యములు సర్వాధిపతియయి యుండు పరమకర్త చే నగును గాని లోక రాజవలన సాధ్యమగునా యనెను. అప్పుడు సేవకుండు వేసటనొంది కన్నీళ్లు ప్రవాహముగా రాల్చుచు నేడ్చి, దగ్గర నున్నవారలను చూచి యిట్లనెను: ఇదిగో, వింటిరా, నేనీ రాజును ముప్పదియేండ్లనుండి సేవించినలాగున, సర్వమున కధిపతియైన పరమ రాజును నొక గడియయైన సేవించియుండినట్టయిన, నా మనస్సు ఆరాటమంతయు తీరియుండునే; ఈ రాజును సేవించిన నాళ్లన్నియు వ్యర్థమయి పోయెనని యిప్పుడు నిశ్చయముగా తెలిసికొంటిని, ఇంకను బ్రతికితినా మనల రక్షింప సర్వశక్తుడైన పరమకర్తను మాత్రమే నేను సేవించెదను. అల్పుల సహాయము నమ్మికొని బ్రతికిన దిక చాలునని చెప్పుచుండగా, వతని యాత్మ అతని నడబాసి పోయెను.

మహా పాతకుడా, వింటివా? అయినను మరణ మెన్నిసార్లు? ఒక్క చేసారి గదా. తొలి మరణములో నూరకయుండి మరు మరణములో నా యాత్మ కార్యములను విచారించుకొనెదనని నూహింపనెట్లు? అయ్యయ్యో, ఒక్కసారికదా మరణము! రెండుమారులు రాదే. అది నిశ్చయమై యుండగా, మోసము రాకుండ చాల హెచ్చరికగా నడచుట కార్యమని తెలిసికొనుము. ఇదిగాక చచ్చినవారలు తిరుగ పుట్టెదరని కొందరు మాహాత్మ్యులు పల్కునట్టు నీవు వానిని నమ్మి మోసపోకుము! హెచ్చరిక. ఎందుకనగా: పిండిన పాలు తిరుగా స్తనముల కెక్కనట్టును, పుట్టిన బిడ్డ తిరుగ తల్లి గర్భమున చొరనట్టును, పోయిన కాలము తిరుగ రానట్టును, రాలిన యాకు తిరుగ మ్రాని కంటనట్టును, చచ్చిన మనుష్యుడు తిరుగ పుట్టుట యసాధ్యము. అందువలన నీకు వచ్చు మరణము దుర్మరణము గాకుండ మెలకువతో నుండుము, లేనట్టయిన ననేకులకు వచ్చిన దుర్భాగ్యమయిన చావు నీకును వచ్చుననుట సిద్ధము.

అదెట్లువలెనన, ఇదిగో! ఒకానొక రాజు కామసుఖములో మునిగి యుండగా, వాని వస్త్రమున వ్రేలాడుచున్న నొక నూలుపోగున

కగ్ని రగులుకొని మంటగా నెగసి క్షణములో శరీరమంతయు వ్యాపింప కాలి చచ్చెను. ఓరి పాపాత్ముడా, తలంపని వేళ నొక సూక్ష్మ విధముగ మరణము పిక్కుజేసి వచ్చి, యీ రాజును పట్టుకొనినట్లు నిన్నును చంపదని నీకు నమ్మకము చెప్పినవా రెవరు?

ఇంకను వినుము; సికెసీంసుడనువాడును కోంటదనువాడను, స్త్రీ సంభోగ సమయములోనే ప్రాణములు విడిచి చచ్చిరి. తలారి మాణిక్యమనువాడు వినోదపు లాటపాటలను చూచుచున్నపుడే క్రమించెను. అనక్రియోన్ అనువాడు ద్రాక్షపండ్లను భుజించుచుండగా నందులో నొక విత్తనము గొంతున పడి యిరుకుకొని పొరబోయి యూపిరి దిరుగక చచ్చెను. సెందోగనువాడు త్రాగిన పాలలో వెంట్రుక యుండి యది లోపల పోయి క్షణములో వానిని చంపెను. ఇవ్విధముననే దియోనిరాజు తాను పంపిన దండు ఎదిరి పటాళముల గెలుమగొట్టెనని విని సంతోషము మిక్కుటముగాగ ఊపిరి విడిచి చచ్చెను. ఓ మేరనువా డలసట మిక్కుటముచే చచ్చెను. దొమిసీయాసనువాడు తాను వివాహము చేసికొనిన దినమున నగర భార్య చేతిని పట్టుకొని రథ మెక్కబోయి యొక కాలు పెట్టి యింకొక కాలెత్తిపెట్ట పోగానే శరీరమున దడబుట్టి తడబడి క్రిందపడి క్రమించెను.

అయ్యో పాతకుడా, సమయమునుగాని యున్న విధమునుగాని గుర్తింపక మరణము వచ్చునని వింటివిగదా. వీరలు చచ్చినట్లు నీవును చావవని నీవు దిట్టముగా నెరిగియున్నావా? తెలియకుండగ వీరలకు వచ్చిన దుర్మరణము నీకును రాకుండునట్లు లిప్పుడే నీ వా భయంకరమయిన కాలములో నిన్ను రక్షింపగల కర్త నారాధించి వేద కట్టడలను మీరక నడచుటే కార్యమని తెలిసికొనుము. మరణమునకు ముందరనే నీకు స్థిరమయిన యాస్పదమై యుండెను దేవ కరుణను సుకృత పుణ్యమువలన పొంది తగ్గట్టుగా హెచ్చరికగా నుండినట్టయిన మరణమునకు భయపడకయే యుండవచ్చును. ఆ దేవకరుణలేక చచ్చితివేని నీకు నరకము తప్పదని యెరుగగలవాడవు.

# తొమ్మిదవ వ్యాఖ్యానము.

## దేవుని యిష్టప్రసాద శ్లాఘనము.

మరణ కాలములో మనుష్యునికి సర్వేశ్వరుని యిష్టప్రసాద ముం డు నెడల వాడు కడతేరునని మనకు తెలియును. అందుకు మరణ తరుణములో దేవేష్టప్రసాదము తనకు నుండునట్లు ప్రతివాడు ఇప్పుడు ప్రయాసపడవలెను. దేవేష్టప్రసాదము మరణసమయమున లేకపోయి నట్లయిన, మనుష్యుడు పరమగతి చేరక, నరక పాతాళమున బడును. కనుక తమ్ముడా, దేవేష్టప్రసాద మహిమనుగూర్చి కొంత చెప్పె దను వినుము.

దేవేష్టప్రసాదమనెడు దేవకరుణ లేని యాత్మ జీవములేని శవ మువంటి దగును. ఫలింపని బీజము, దేవేష్టప్రసాదము లేని తపము అత పము, దేవేష్టప్రసాదము లేని జ్ఞానము అజ్ఞానమే, దేవేష్టప్రసాదము లేని శాస్త్రము నీటిమీది బుగ్గవంటిది, దేవేష్టప్రసాదము లేని జపప్రా ర్థనలు వ్యర్థపు మాటలే, దేవేష్టప్రసాదము లేని సొంపు అసహ్యమే; దేవేష్టప్రసాదము లేని సుఖము నిర్భాగ్యమే; దేవేష్టప్రసాదము లేని క్రియ విఫలమని నీ వెరుగవలయును. ఇటువంటి దేవకరుణను నరుడు గైకొనక పోయినట్లయిన మోసము వచ్చుట నిశ్చయము. అందువలన నీవు చేయు క్రియలు ఫలవంతములగుటకు దేవేష్టప్రసాదము నీకుండ వలయును. అది లేక యీడేరుట సాధ్యము కాదనుటం జేసి దేవుని యిష్టప్రసాదము పొందుటకు తగిన పుణ్యములను చేయుట అవసరమే. ఓరీ, పాపాత్ముడా, దేవేష్టప్రసాదము చేకొనునంతటి భాగ్యముకంటె భూలోకమున మరియొకటి లేదు. దేవేష్టప్రసాదము పొందినవాడు సర్వేశ్వరుని దేవాలయమై యుండును. మోక్షరాజ్యమున ధన్యుం డగును. దయాపూర్ణుడగు కర్తకు నసుగు బిడ్డయై యుండును. సకల పుణ్యఫల సంప్రాప్తుం డగును.

ఓరి మూఢాత్మా, యింతటి భాగ్యమును రప్పించు భాగ్యము అసహ్య పాపముకొరకుగా విడిచిపెట్ట తగునా? దీనిని వెతకక నలక్ష్య

ముగా నుండవచ్చునా? లోకమంతయు నీకు వచ్చినను సర్వేశ్వరుని యట్టి వెలలేని వరప్రసాదము విడుచుట న్యాయమా? దానిని విడుచు నెడల నింకెప్పటికిని ఈడేరవనుట నిశ్చయముగదా. వెలలేని నవరత్నముల నిచ్చి యొక పగిలిన మంటిపెంకు మంచిదని యెంచువారు కలరా? స్థాపించిన దీపస్తంభమిచ్చి, మంటి ప్రమిదను మార్చుకొనువాడు కలడా? ఓరి పాతకుడా, దేవేష్ట ప్రసాదము కొంచెమని యెంచి విసిరి వేసి నీచపాపమునకై పోవుచున్నావా? ఇదిగో ఈ లోకములోగల మేళ్లన్ని సుగంధ పరిమళ ప్రవాహములనియు, సముద్ర తటాకములన్ని యమృత నిధులనియు, కొండలన్ని రత్నపర్వతములనియు తలంచినవాడు వీఁటన్నిటిని యొక మట్టిగడ్డకై యిచ్చునా? ఓరి పాపి, వీనికంటె అతిశయించిన భాగ్యమగు దేవేష్ట ప్రసాదము పాపలోలుడగాను నేలఁ పారవేసి పోవుచున్నావు? అగ్నికంటె ప్రభావమును, లోకమును వణికించు శౌర్యమును, సమస్త మానవులను గెలువనగు పరాక్రమమును గలవాడు వానినన్నిటి నొక బొట్టు తేనెకుగా నిచ్చివేయునా? ఓరి పాతకుడా, శౌర్యపరాక్రమములకంటె నధిక ప్రభావము కలిగిన దేవేష్టప్రసాదమును స్వల్ప లోకసుఖములకుగా నెందుకు పారవేసెదవు? అమృతము మాని విషము వాసి యనువాడు గలడా? పరమగతియగు మోక్షము విడిచి దుర్గంధ నరకము వాసి యని దాని గోరువాడు కలడా? సౌందర్యములేల, భాగ్యసంపదలేల, శోభనప్రతాపములేల, పరమగతి యేల యని చెప్పువారలు కేవలము పిచ్చివారని చెప్పవలెను గదా. అయ్యో పాతకుడా, ఎందు కీలాగున తిరుగుచున్నావు? పరమకర్త కరుణించెడు వెలలేని యిష్టప్రసాదము సకల భాగ్యముల కలుగజేయు మహా భాగ్యమై యుండలేదా? అట్టి భాగ్యమును వెతకక మూర్ఖుడవై, నిన్ను జెరచెడు పాపమును విడువనని పట్టు సాధించెద వేల?

పాతకుడా! యీ లోకములో పేరు ప్రఖ్యాతి ఆశించనివాడు లేడుగదా. ఇదిగో నీవుమాత్రము పాపమును విడువక నీచుడవై యుండ దెగువ చేసెద వేల? మండల ఆకాశమునకు సూర్యుడు కాంతి, మేఘములకు జలంబు కాంతి, మనుష్యునికి జ్ఞానము కాంతి యగును. ఆ

లాగున దేవేష్టప్రసాదము మనుష్యునికి కాంతియగును. ఆ దేవవరము యొక్క కాంతి లేని యాత్మ యేలాగున నుండుననగా: సూర్యుడు లేని యాకాశమండల మంధకారమైనట్టును, జలంబు లేని మేఘము వట్టిదైనట్టును, బుద్ధి లేని మనుష్యుడు మృగమైనట్టును, ఆ దేవవరము లేని యాత్మ యున్నదని యెరుగవలయును.

దేవేష్టప్రసాదము లేకుండ, నెన్ని పుణ్యములను చేసినను, పరమ గతి నిచ్చు ఫలములు లేవు. గాన సకల పుణ్యములకు జీవమై యుండెడు దేవేష్టప్రసాదము నీచ పాపములకొరకు విడనాడుటేమి? పాపమును విడువక యే కడతేరెదనని స్వల్ప బుద్ధితో తలంచుకొనరాదు. ఎందుకనగా పాపముచేత దేవేష్టప్రసాదము నాశనమైపోవును. ఇట్లుండగా, పాపమును విడువక కడతేరెదనని తలంచుటెట్లు? దుర్గంధపు పీనుగులోనుండి సుగంధము వీచునట్టును, సర్పము నోటిలోనుండి యమృత మూరనట్టును, అగ్నిలో శీతలము బయలుదేరునట్టును, పాపములోనుండి పరమానందము రాదు. ఒక వేళ దుర్గంధపు కంపులోనుండి సుగంధము వీచినను, సర్పము నోటినుండి యమృత మూరినను, అగ్నిలో శీతలము పుట్టినను, దుర్గంధ పాపము విడువకున్న ఒకనాటికిని పరమానందము పొందుట సాధ్యము కాదని యెరిగి పుణ్యము సంపాదింప ప్రయాసపడుము.

పాతకా, యీ పరమ సత్యముల నాలకించితివా? ఇకనయిన పాప మార్గము విడిచి, దేవేష్టప్రసాదము పొంద తగిన పాటు పడుము. ఎందుకనిన మరణము రాక ముందరనే ఆ దేవేష్టప్రసాదము చేకొంటివేని అది నిన్ను కాచును. నీవు పాపములోనే చచ్చినట్టయిన పరమ కర్తయొక్క సన్నిధిలో ప్రత్యేకతీర్పు విన నీవు పోవునప్పుడు, ఆయన నిన్ను నిర్లక్షించి విడిచి, నిత్యకాలము మండు దుర్గంధ నరకములో పడద్రోయును. అయ్యో పాపాత్ముడా, ఈ భయంకరపు చేటు నీకు రాకుండ తగిన కాలములోనే యశుద్ధ పాపములను తొలగించికొని సుకృత పుణ్యములను చేయ దొడగుము.

# పదియవ వ్యాఖ్యానము.

## ప్రత్యేక తీర్పుయొక్క భీకరము.

మనుష్యుని యాత్మ శరీరమును విడిచి యెడబాసిన తక్షణమే సకలమునకు నధిపతి యగు దేవుని సముఖమునకు వెళ్లి తాను చేసిన పాపపుణ్యములనుగూర్చి నీతి విచారణ నొందును. తీర్పు వినుటకు కర్త యెదుట నిలువబడును. అట్టి సమయమున న్యాయము వగదెంచుటకు వేంచేసి యుండెడువాడు, తాను ఆ ఆత్మకు చేసిన యుపకారములన్ని యొక్కొక్కటిగా తెలియపరచి, ఆ యాత్మతో: ఆ యుపకారముల న్నిటికి నెట్లు మేలెరిగి నడచితివి, ఏ తీరున భక్తిగా నుంటివి, ఒక్కొక్క ప్రశ్నకు తగిన బదులుత్తరము చెప్పుము. నీకు సంభావనగా మోక్షమో, లేక శిక్షగా నరకమో విధింప నీకు తీర్పు చేయ వచ్చియున్నానని యడలించును.

మరియు పాపాత్ముడా, యేసువు ఈదిగువ మాటలు నీతో చెప్పుచున్నాడని తలంచుకొనుము: ఓరీ మనుజుడా, ఏమిలేమినుండి నిన్ను నిర్మించి, పరమగతియగు మోక్షము చేర వరప్రసాదము లనేకములు నీకు దయచేసితిని. జ్ఞానబలము బుద్ధి మొదలైన నానా విధములైన మేలులను నీకు నొసంగితిని. వానిని కొని నీవు పుణ్యపు త్రోవలో నడువ బూనుకొందువని నీకు వేదకల్పనల నిచ్చితిని. వానిని నీవు సులభముగా ననుసరింప నీకు ధైర్యమును మాత్రకయు ఉండుటకు నేను భూలోకమున మనుష్యుడై నవతరించి, నా మంచి నడతచే మాత్రకయు, నేనిచ్చిన వాగ్దత్తములచే నీకు ధైర్యమును ప్రసాదించి, కడకు నీకొరకై పడరాని పాట్లు పడి, రక్తము చింది ప్రాణ మిచ్చితిని. నీవు పరమగతి చేర మొదటి వాకిలియై యుండెడు జ్ఞానస్నాన మనెడు మేలును, తరువాత నీవనుదినము చేయు ఘోరపాపములు విమోచనమగుటకు పాపసంకీర్తనమనెడు మేలును, నీవు సన్మార్గములో స్థిరముగా నిలిచి నిత్యజీవమును పొందుటకు జ్ఞానభోజనముగా దివ్యసత్ప్రసాదమనెడు మేలును, ఇంక లెక్కలేని యుపకారములను చేసితినికదా.

వీనికన్నిటికి మేలెరిగి నీవు నడిచిన మార్గమేదని దేవుడు అడుగును.

పరమకర్త చేసిన యుపకారములకన్నిటికి మేలెరిగి, యధిక భక్తితో లోకము వర్జించి పుణ్యమార్గములో స్థిరముగా నడిచి జపతప దానధర్మముల జేసి, పిశాచి తంత్రములలో జిక్కని పుణ్యాత్ముడైనవాడు దేవునియెదుట నే మాత్రము వడకక నిలిచి, దేవ తీర్పు వినగోరును. అయినను పరమకర్తయొక్క మేలులను మరచి, పిశాచి తంత్రములలో జిక్కి, పుణ్యములను చేయక పాపముల చేసిన యాత్మ తన పాపముల దుష్టత్వము జూచి బుద్ధి కలంగి భ్రమజెంది గడగడ వణకుచు దేవుని సముఖమున నిలుచును. ఎందుకనగా పాపాత్ముడు దేవుని యెదుట నిలువగా, తన పాపపు మైకము తెలిసి, తాను పిశాచి తంత్రములలో బడి దానిని నమ్ముకొని దబ్బర యానలను టక్కుపిక్కులను చాడికొండెములను, క్రోధ మదమాత్సర్యములను, మాతాపితల నెదిరించుటయును, తిరుగబడ కట్టడ ఇచ్చిన అప్పు పండుగల నాచరింపక తిరుగుటయు, ఒక్కప్రొద్దు ఉపవాస జపధ్యానముల చేయక పోవుటయు, లోభ మోహాశలను కలిగియుండుటయు, నింకను వివిధ ఘోర పాపములలో మరణపర్యంతము మసలుటయు, తేటగా తెలిసికొనియుండెను. పాపాత్ముడు తాను శరీర సుఖములను నమ్మి దేవుని దయను ధారబోసికొనుట యెంతో గొప్ప నష్టమని గ్రహించి దిక్కు తెలియక దేవుని సముఖములో నిలుచును.

ఆ సమయమున నరకపిశాచి యార్భటించి పెద్దపులివలె రొప్పుచు పాపాత్ముని దగ్గర నిలిచి వాడు చేసిన లెక్కలేని పాపముల నొక్కటిగా వర్ణించి, వానిపై నేరము మోపి, నిత్యాజ్ఞలకు తీర్పు వగదెంచుడని యడుగుచు, పరమకర్త తీర్పు విధించి యా ఆత్మను తన కైవసము చేయుపర్యంతము అగ్ని సంకెళ్లను చేత బట్టుకొని యత్యాతురముగా కాచుకొని యుండును.

అయ్యో పాపాత్ముడా, ఇప్పుడు దేవుని ఆజ్ఞలను మరచి, అతని యనంత కృపాకరములగు మేలులను కొంచెమైన నెంచక తిరిగెదవేల? అప్పుడు నీకు దిక్కేది? శరణమేది? నీ కట్లు తటస్థించుననని యెరిగియు

కొంచెమైనను భయపడక పాపములలో తిరిగెదవా? ఆ యిట్టి సమయమున నీకు నేయాశరువు చిక్కును? అనేక దినములు వనములో వాసమై జపతపములలో సుకృత క్రియలలో కాలక్షేపము చేసి, మహా తపోధనుడను పేరు పొందిన యొక్కనికే నేమి సంభవించినది నీవు వినలేదా? తెలియ చెప్పెదను వినుము. ఒకనాడు ఒకానొక ముని వనములో ధ్యానపరవశుడై తన యాత్మ తన్ను విడబాసినట్లును, తీర్పు వగదెంచు పరమకర్త యొక్క సముఖమున నిలువబడినట్లును సర్వేశ్వరుడు తన్ను జూచి: భక్తి శ్రద్ధ విశ్వాసములతో నీవు చేసిన సత్క్రియ లేవేవి లెక్క చెప్పుమని యడిగినట్లును చూచెను. ఆ మునికి వచ్చిన భయకంపమును మనశ్చాంచల్యము నింతింత యని చెప్పిన దీరదు. పరవశత తీరిన వెంటనే తానుండుటకు మాత్ర మొక చిన్న గుడిసెను కట్టించుకొని యందులో దూరుకొని దాని వాకిలి రాతితో మూయించి తనకు పలసిన యన్నోదకము మాత్రము అందుకొనుటకు నొక చిన్న కంత పెట్టి యా యంధకారపు గుడిసెలో పండ్రెండేండ్ల పర్యంతము ఒకరితోను మాటాడకయు వెలుపలికి రాకయు అందులో వాసమై కఠోరమైన తపస్సు చేసెను. కడకు వాని మరణము సమీపించెనని యితర మునులు కనుకొని వాని గుడిసెను పగులగొట్టికొని లోపలికి పోయి ఆతనిని చుట్టుకొని: సహోదరుడా, నీవు మరణము పొందక మునుపు మా కేమయిన మంచి బుద్ధి చెప్పుమని బలిమాలిరి. అప్పుడు ఆ తపోధనుడు వారలను చూచి: నేస్తులారా, నేను గనిన యొక దర్శనమును మాత్రము వచింతును. మరణసమయమున పరమకర్త వాడు వాడు నడచికొన్న నడతలను శోధించి యడిగెడు ఖండితమైన విధమును మనుష్యుడు తెలిసికొనినయెడల వా డెన్నటికిని పాపము చేయనొల్లడని చెప్పి తాను జీవము విడిచెను.

అయ్యో పాతకుడా, వింటివా? ఆ మునికన్న నీవు పుణ్యములో పతిశయించినవాడవా? అతడన్ని సంవత్సరములు ఘోర తపము చేసినను భయపడి గడగడ వణికెనని వింటివిగదా. ఒక పుణ్యమునైన చేసి యెరుగని నీవు కొంచెమైనను భయపడక శరీరవిషయములోనే మన

ష్న బెట్టి దినములన్నియు వ్యర్థముగా గడపుటెట్లు? మరణము వచ్చి జీవ మెడబాయు తరుణములో పరమకర్తకు నేమని లెక్క చెప్పబోవుచున్నావు? కాలముండగానే నీ నడత మార్చినపక్షమున నీకు మేలగును, లేనియెడల నీకు వచ్చు తీర్పు బహు భయంకరమని కనుగొనుదువు. అప్పుడు నీయాత్మను నరకమున త్రోయుదురు. లోకము ముగియు కాలమున పరమకర్త చచ్చిన మనుష్యులందరిని ఆత్మ శరీరములతోకూడ లేపును. అట్టి వేళ నరకములో పడియుండెడు నీయాత్మ ముందు విడిచిపెట్టి పోయిన శరీరమును తిరుగ ధరించుకొని తన పాపాక్రమములకై శరీరముతోకూడ తీర్పు న్యాయమునకు లోనగును. అందరితోకూడ దేవుని సముఖమునకు నీవును వెళ్లెదవు. ఆయన దుష్టులనందరిని శపించి నరకములో త్రోయును. నిన్నును వారితోడ త్రోసివేయును. ఆ గట్టు కానరాని యగ్ని సముద్రములో పడి, పాపాత్ముల మూకతో నీవును మునిగి కాలుచుందువని భయపడితివేని, నీవు ఇప్పుడే భయపడి దేవుని తీర్పును మాటిమాటికి తలంచి నీ పాపములన్ని వర్జించి పుణ్యమార్గము చేపట్టుము.

## పదునొకండవ వ్యాఖ్యానము.

### పొత్తు తీర్పు.

సమస్త మానవులను పరిపాలించెడు దివ్యరక్షకుడును, అనంత నీతిపరుడును, సత్యుడైన సర్వేశ్వరుడునగు జేసువు, మనుష్యులలో మోక్షము పొందువా రెవ్వరనియు, తాను పాటుపడిన కష్టముల ఫలములను తిరస్కరించి ద్రోహులై పోయి నరకమున పడువా రెవ్వరనియు తెలియపరచును. చచ్చిన వారలందరి నాత్మశరీరములతో కడదినమున లేపి, వారు వారు చేసిన క్రియలకు దగిన తీర్పు చేసి, కొందరికి బహుమానముగా మోక్షమును, కొందరికి నిత్యశిక్షగా నరకమును నిత్తురు. అందుకై సకల మానవు లెరుంగునట్లు ఒక దినము నియమించి యున్నాడు. అదే పొత్తు తీర్పు జరుగబోవు కడదినము.

అదిగో ఆ దినమున జేసునాధుడు పరమకర్త యని సమస్త మానవు

లెఱుంగను చూడను, తాను వేంచేసి వచ్చి యానతిచ్చున దేమనగా: చచ్చినవారలారా, జీవంతులై లేచి తీర్పునకు రండి యని పలుకును.

మహా బలవంతమైన ఆ వచనము విన్నతోడనే చచ్చినవారలంద రును ముందరి శరీరములనే తిరిగి దాల్చికొని పునర్జీవితులై లేచి తీర్పు నొందుటకు జేసునాథుని పాదముల కడకు వచ్చి నిలుచుదురు. అట్టి లోకాంత్యదినము ఏ సంవత్సరమో యే నెలయో యే దినమో తీర్పు దీర్చెడు పరమకర్తకు మాత్రము తెలియును గాని మరియొకరికి తెలియ దు. అయినను ఆ కాలమున సంభవించెడు గురుతులు సువిశేషములో వ్రాయబడిన వేవనగా:

సూర్యుని ప్రకాశము మసకై పోవును. చంద్రుడు రక్తవర్ణమై తో చును. వృక్షముల యాకులు పెద్ద పడిగాలికి రాలి పడినట్లు నక్షత్ర ములు రాలి పడును. చర్మము ముడుక్కునట్టుగా గగనము ముడుక్కును. భూమియు కంపించును. అట్టి భూకంపములో దీవులును పర్వతములును మిట్టి పడి పాతాళమునకు క్రుంగిపోవును. మనుష్యులలోను తమలో తా మొకరొకరిపై మహా క్రూరముగా దోషము మోపుకొనుచు యుండుటగాక కఠినమైన తెగుళ్లును ఘోర రోగములును చావులును సంభవించుచుండ లోకమునకు మహా కష్టములు కలుగును. కడకు గగనమునుండి యగ్నివాన కురిసి సర్వలోకమును కాల్చి భస్మీకరిం చును. ఇదిగో ఇవే లోకసంహార దినమున కలుగబోవు గురుతులు.

పృథివి జలము వాయువు అగ్ని ఆకాశమను పంచభూతములను మనుష్యుడు కలిగియుండుటవలన శాస్త్రజ్ఞులు మనుష్య దేహ చిన్న లోకమని చెప్పుచున్నారు. చిన్న లోకమనెడు ఈ మనుష్యున కంత్యకా లము వచ్చునప్పుడు వానియందు నుండెడు పంచభూతములును క్రమము తప్పి యొకటికొకటి పొసగక క్రిందిట్లు మీదిట్లయి మనుష్యుని తొం దరపరిచి, చాల చక్కదనముతో చెరలాడెడు మనుష్యుని కొంతసేప టిలో కదలని కట్టెవలె చేయును. ఇదిగో అట్టి మరణసమయమున రెండు కన్నులు చూడలేక పోవును, చెవులు వినలేకపోవును, నాలుక మొండును, కాళ్లు చేతులు తడబడును, కడుపు ఉబ్బును, రొమ్ము ఎగ

పట్టుకొనును, ఉసురు ఉడుగును, ఈ గురుతులు సంభవించిన పిమ్మట జీవము పోవును, దుర్గంధ శవమగును. అలాగునసే పరమకర్త లోకమును వగదెంచు కాలమునకు ముందుగా, అతడు దానికి కట్టడ చేసిన క్రమములు తప్పిపోవును. ముందర చెప్పబడిన గురుతులు సంభవించిన వెనుక లోకము నాశనమైపోవును.

అట్లు లోకమంతయు నగ్నిచే భస్మము చేయబడుచుండగా, లోకమునకు న్యాయము వగదెంచు పరమకర్త జేసువు జ్యోతిర్మయమైన రొంకి మేఘభద్రాసనముపై మహా మహిమతో కూర్చుండుకొని ఒలివేత్తు అను పర్వతముమీదికి దిగివచ్చును. అతడు పరమండలమునుండి దిగి వచ్చునప్పుడు సన్మనస్కుల తొమ్మిది విలాస పథలు తగిన మహా రూపలక్షణలావణ్యములతో పరమకర్తకు వెనుక ముందు పరివారముగా చేరుకొని, యతడు సర్వలోకమును రక్షించినదానికి గురుతుగా స్లీవను నతనికి ముందుగా నెత్తుకొని, జేజే యను జయస్తుతులు మహానంద సంగీతములు బోరుకొల్పుదురు. పరలోక భూలోకములకును సన్మనస్కులకును రాణియు. పాపములకు శరణమునై నిత్యకన్యయైన దేవమాత సువర్ణ రత్నఖచితమైన సింహాసనముపై తన తిరుకుమారుని కుడిపార్శ్వమున గూర్చుండుకొని యుండును. మరియు దివ్య రక్షకునితోకూడ ఈ లోకములో సంచారము చేసి, యతడు కలిగించిన సత్యవేదమును చేసిన యద్భుతములను లోకము రక్షింప నతడు పడిన శ్రమలను సర్వలోకములకు తెలిపి, తాము చాటించిన వేదమునకై తమ ప్రాణమును ధారబోసిన పంద్రెండుగురు అపోస్తులులు ఒక్కొక్కరు మహారాజులకు యోగ్యమైన వైభవములతో న్యాయకర్త కిరుప్రక్కల కూర్చుండియుందురు.

అట్టి సమయమున సమస్త మోక్షవాసుల యాత్మలు బహు దినములుగా చెడిపోయి యుండిన తమ శరీరములను తిరుగ ధరించుకొని, యక్షయ సూక్ష్మ లఘు ప్రకాశములనెడు నాలుగు వరములు శరీరములో పొందినవారలై మహానందముతో లేచి న్యాయకర్తయొక్క కుడిపార్శ్వమున వచ్చి నిలుతురు. దుర్గంధ నరకములో బడియున్న

యాత్మలును తమ యవలక్షణ దుర్భర శరీరములను ధరించుకొని వచ్చి నరకముయొక్క ఘోర బాధలన్నిటిని తామెత్తిన యా శరీరములలోనే యనుభవించుచు చెప్ప తరముగాని బాధలతో మృతులనుండి లేచి, పిశాచులచేత నీడ్చి తేబడి, పరమకర్తయొక్క యెడమ పార్శ్వమునకు వచ్చి చేరుదురు.

అదిగో యట్టి వేళ మహా ప్రతాప శోభన సౌందర్యములతో నొప్పు పరమకర్తయొక్క సముఖమును, అతి వినోద శోభనముతో దివ్య రక్షకుని కుడిపార్శ్వమున నుండెడు సన్మనస్కుల విలాస సభలును మోక్షవాసులును పొందియుండు మహిమ ప్రతాపమును, వారు మహా రాజులకంటె సుఖించి యుండుటయును పాపాత్ములు చూచి ముఖము చిన్నచేసికొని: అయ్యయ్యో, వీరలవలె మేమును పుణ్యమార్గములో వేదకల్పనలచొప్పున నడిచియుంటిమేని, వీరలతోగూడ మహిమగల వారలముగా నుండవచ్చును. సకల ఘోర పాపముల నాచరించినందువలనగదా మాకీ నరకాజ్ఞ సిద్ధించెను. ఇప్పుడీ బాధలన్ని పడవలెను. అయ్యో ఆ పుణ్యాత్ములనుగదా మేము పరిహాసము చేసి నిందించితిమి. ఇప్పుడు వీరు పరమకర్తకు చనవరులై మహారాజులుగా నెన్నటెన్నటికిని కుశలముగా నుండురనుట నిశ్చయము. మేము మతిచెడ్డవారలము. సత్యమార్గమునుండి తొలగితిమి. మేము గతి తెలియనివారివలె పాపపు ద్రోవలో నిష్టానుసారముగా నడచి నడచి యలసితిమి. మేము అహంకారములో పొంగి కామభోగములలో సుఖించి నడచినందుకు ఈ నరకమే మాకు గతి ఆయెను. మేము అనుభవించిన సుఖభోగములన్నియు నీడవలె మాయమై పోయెనుగదా. ఈ సమయమున దానధర్మముల యాదరువు కానమే. ఇక మాకు దిక్కెవరని చెప్పి, పండ్లు పటపటమని కొరుకుచు గడగడ వణకుచు కడు వ్యాకులపడి: అయ్యో మన తప్పుచేతనే మనము పరమగతి పోగొట్టుకొంటిమని యేడ్చి మొత్తుకొని తీర్పు జరుగుపర్యంతము పదరుచు మహా వేదనతో కాచుకొనియుందురు.

# పండ్రెండవ వ్యాసము.

## తుదితీర్పు.

సర్వశక్తుడైన పరమకర్త వాని వాని నడవడి రీతికి తగినట్టు నరకశి క్షగాని మోక్షభాగ్యముగాని ప్రతిఫలముగా నిచ్చును. నీతిన్యాయము తీర్పు వేంచేసి వచ్చు యేసునాథుని తిరుసన్నిధానమున వచ్చినవారలం దరు సజీవులై వచ్చి తమ తమ పాపపుణ్యములకు తగినట్లు ప్రతిఫల ము పొందుదురు. పరమకర్త తన కుడిపార్శ్వమున నుండు పుణ్యాత్మ లు మరణపర్యంతము దానధర్మప్రకారములలోను జపధ్యానములలో ను భక్తి విశ్వాసక్రియలలోను విరక్తత్వ మనుసరించుటలోను స్థిరముగా నడిచి లోకము పిశాచి శరీరమనెడి మూడు శత్రువుల మహా శోధన లలోను చిక్కుకొనక దేవచిత్తము ప్రకారము నడిచినందువలన, వా రలకు నిత్య మోక్షము బహుమానముగా నిచ్చెదననియు, తన యెడ మ పార్శ్వమున నుండు దురాత్మలు వేదకల్పనలను మీరి దొంగత నము అహంకారము కోప లోభ మోహ మద మాత్సర్యములు భోజ నప్రియము సోమరితనము మొదలగు దుర్గుణములకు గులాములై పిశా చులను నమ్మి వాని మంత్రతంత్రములు శూన్యములు ఇంద్రజాల ములు మొదలగు మహా పాపకర్మములలో మరణపర్యంతము నడిచి నందువలన వారలకు శిక్షగా నిత్యనరకమే విధించెదననియు, నిటుల ఒక్కొక్కడు చేసిన పాపపుణ్యములను లేశమైన మరుగులేక సకల జనులకు తేటగా తెలిపినమీదట న్యాయముతో తీర్పు విధింపబోవును.

అంతట తన కుడిపార్శ్వమున నుండు పుణ్యాత్మలను ప్రేమ లల రెడు చూపులతో జూచి: మా పితచే నాశీర్వదింపబడిన భాగ్యవంతు లారా! లోకారంభమునుండి మీకై నియమించి యుండెడు నిత్యానంద మోక్షభాగ్య మనుభవింప రండని యనును. తరువాత తన యెడమ పార్శ్వమున గడగడ వణకుచు నిలుచుండు పాపాత్మలను మిక్కిలి కోపముతో నురిమి చూచుచు, పిడుగు పడినట్లు భయంకరముగా తీ ర్పు చెప్పుచు: ఓరీ నిర్భాగ్యులారా, నన్ను నిరాకరించి, పిశాచుల

నమ్మి, వాని మాయలలో తగిలికొని వీఁ యిచ్చుచొప్పున దుర్మార్గమున నడచితిరి. ఇదిగో పిశాచికిని దాని నమ్మిన పాపాత్ములకును సిద్ధయించి యుండెడు నిత్యాగ్నిలోనికి పొండి యని శపించి వారినందరిని నేక కూటముగా నిత్య నరకములో త్రోయును.

పరమకర్త భయంకరమైన యీ తీర్పును వినిపించినతోడనే భూమి యదరి వణకును. భూమి విరసి, ఘోర పాతాళముగా నోరు తెరవగా, నా త్రోవగా పిశాచులును పాపాత్ములును దొర్లి యారని యగ్ని సముద్రములో బడి యనంతకాలము మండుచుండెదరు. ఆలాగున పాపాత్ములందరు పిశాచులతో కూడ దుర్గంధ నరకమున బడినతోడనే, పరమండలమును భూమండలమును కర్తయొక్క తిరుకట్టడచొప్పున మహాలంకృత రూపలావణ్యముతో నవనక్షత్రమువలె నిష్కళంక ప్రకాశముతో వెలుగును. అంతట న్యాయమును వగదెంచుటకు పరమకర్త తన్ను చుట్టుకొనియున్న పరివారమైన యగణిత సన్మనస్కులను పుణ్యాత్ములను వెంట గూర్చుకొని మహా మహిమతో నొడ్డోలగముగా జయ జయ స్తుతులతో పరలోకమునకు తర్లి పోయి, వారలకు నియమింపబడిన నిత్యానంద మోక్షభాగ్యము నిచ్చును. ఆ మోక్షరాజ్యములో వారలకు కలుగు నానంద సౌఖ్యములు మహిమప్రతాపములు వర్ణింప తరముకాదు.

ఇదిగో బుద్ధిమంతులైనవారలు పై చెప్పబడిన రెండు తీర్పులలో రొకొక్కటి తప్పక సిద్ధించునని యెరిగి, యీ రెంటిలో తమ కేది మేలు యని కాలముండగానే విచారించి, యీ దినమను తరుణములోనే రెంటిలో నొక్కటి నేర్పరచుకొనవలసియున్నది. మోక్షము కావలయుననిన బ్రతుకు స్వల్పకాలములో ప్రపంచమును నమ్మి వ్యర్థముగా గడపక ధర్మమార్గమును పట్టి పుణ్యములలో నడవవలయును. అందుకై పొత్తుతీర్పునుగురించి అప్పుడప్పుడు తలంచుట మహా ప్రయోజనముగా నుండును. ఇందుకు దృష్టాంతముగా అవిశ్వాసుడైన రాజొకడు, శాస్త్రవేద జ్ఞానియు బహునిపుణుడునై యున్న యొక మునిని రప్పించి, మహా భయంకరమైన చరిత్రము నొక్కటి వ్రాసికొని

రమ్మనెను. ఆ ముని పొత్తుతీర్పుయొక్క భయంకర విశేషములను చాల తేటగా వివరించి దాని వివరము తేటగా వినిపింపగా, రాజు దాని విని, తత్తళింప వగఁగొనుచు, నిటువంటి భయంకరమైన తీర్పునకు తప్పించుకొనుటకు తెర వేదని యడిగెను. అందుకు ఆ మునివరుడు దబ్బర మతములను విడిచి నిజమైన యేకదేవు నారాధించి యతని యాజ్ఞల చొప్పున మరణపర్యంతము నడిచితివేని యాతీర్పునకు భయపడక యుండవచ్చునని. ఆ మునివరుడు చెప్పిన సద్బుద్ధిచొప్పున నా రాజు తన దబ్బర దేవరలను విడిచి సత్యవేదమును చేకొనెను.

ఓరి పాఠకుడా, పొత్తుతీర్పు వివరమునుగూర్చి భయపడుచున్నావా? సత్యవేదము మరచి మూఢుడవై పోతివా? అదియంతయు నట్టిదని నాస్తికుడవైతివా? ఆ తీర్పులో నాకేమి భయమని గర్వించెదవా? మూఢాత్మా, ఘోర తపము చేసిన వనవాసులుకూడ దానిని తలంచినమాత్రమున వణకి వగచిరని యెరుగవా? వివేకము గలవాడవై యీ భయంకరపు తీర్పునకు నభయము కోరితివేని. ఇప్పుడే యీ మంచి సమయములోనే నీ పాపములన్నియు విడిచిపెట్టి, దేవకల్పనలచొప్పున యాతీర్పులో నీకాదరువై యుండెడు సత్కృతములాచరించి పరిశుద్ధుడవై నడువుము.

# పదుమూడవ వ్యాఖ్యానము.

## మోక్ష వివరము.

---

ఒక మహాత్ముడు మోక్షరాజ్యముయొక్క పరమానందమునందు గల యనంత శోభన ప్రతాపములను వ్రాసి వర్ణింప గోరి యుండగా, నొక యాశ్చర్యకరమైన శబ్దము వినెను. అదేమనగా: గట్టు కానని సముద్రజలము ఆపి నిలుప నీచేత నగునా? లోకమంత నీ యరచేతిలో చేర్చి పెట్టుకొనగలవా? సూర్యచంద్రనక్షత్రముల గమనములను తడకట్ట నీకు సాధ్యమగునా? ఇదిగో ఒకవేళ నివియన్నియు నీచేతనైనను, మనోవాక్కుల కందని మోక్షరాజ్యముయొక్క నిత్యమైన మేలులను చెప్ప నీతరముకాదు అని ఆ శబ్దము చెప్పెను. మోక్ష సాం

దర్య ప్రతాప మహిమలను వర్ణింప వచ్చునని యెంచువార లెవరు? వేద గ్రంథములలో మోక్షముయొక్క మహోన్నతినిగూర్చి యెంత చెప్పినను, నది మనుష్యుని బుద్ధి కందదు. అందువలన నందినమాత్రము వర్ణించి చెప్పుట దాని నీడను వర్ణించుటగా నున్నది. అట్టి యఖండమైన మోక్షమహిమ మానవబుద్ధియందు నణగనేరదు. గనుక చెప్పిన నంతటిలోనే మోక్షానందభాగ్యమంతయు నణగియున్నదని తలంపవలదు. ఆ పరమభాగ్యము బుద్ధి మనోవాక్కుల కతీతయించి యున్నదని తలంపుము.

మొట్టమొదట మనకు కనబడు పరమండల విశేషములను సావధానముగా వినుము. సూర్య చంద్ర నక్షత్రములపైన నున్నత గగనమున నత్యంత శోభనముతో నిండిన పరమండలమే మోక్షరాజ్యమని యెరుగుము. ఆ పరమండలముయొక్క విశాల ఉన్నతము లెంత యనిన, ఇదిగో భూమినుండి దినమునకిరువదియైదు ఆమడలచొప్పున రెండు వేల యేండ్లు పోయిన, సూర్యచంద్రులుండెడు గగనభాగములు దాటి నక్షత్రము లుండెడు మండలమునకు చేరవచ్చును. అక్కడినుండి దినమునకిరువదియైదు ఆమడల వేగముతో తిరిగి రెండు వేలసంవత్సరములు పోయిన, నక్షత్రమండలము దాటవచ్చును. అదిగో ఆ యున్నత ప్రదేశమునుండి భూమండలమును వెనుకకు చూచిన, నొక చిన్న రవగా దోచి తోచునట్లుండుననియు, నక్కడనుండి యొక పెద్ద కొండకు సమానమైన గుండును దొర్లించి విడిచిన, భూమిమీద పడుటకు తొంబది సం॥ లు పట్టుననియు వేదపారాయణులు వ్రాసియున్నారు. ఇవ్విధమున నక్షత్ర మండలము దాటి మరి పైగా పోయి, దినమున కిరువదియైదు ఆమడలు నలుబదివేల యేండ్లపర్యంతము నడచిన, నా మోక్షరాజ్యము బహు దూరమున నదిగో కనిపించుచున్నదని చెప్పవచ్చునుగాని యింత దూరములో నున్నదని చెప్పుటకు సాధ్యము కాదు. ఇదిగో బుద్ధి కందని యింత యున్నతిలో దర్శనము కానగు మోక్షరాజ్య మున్నదని యెరుగుదువుగాక, దాని యున్నతిని కూడినమాత్రము చెప్పి చూచితిమి. ఆ రాజ్యముయొక్క విశాలత యింత యని కొంత

వివరించెదము. వినుము

సముద్రములోను భూమిలోను నుండెడు నిసుకయంతయు నొక్క రాశిగా బోసి, యందలి రవలెన్ని యున్నవో యన్ని లోకము లుండునని యెంచుకొనుము. ఇట్లు అగణితంబైన లోకములన్ని నొకటిగా చేర్చుకొనిపోయి మోక్షరాజ్యములో పెట్టినట్టయిన, ఆ యగణితంబులైన లోకముల విశాలతయంతయు మోక్షరాజ్య విశాలతకు సరియగునో కాదో యని తోచక యుండునట. ఈలాగున మనోవాక్కుల కందని యున్నతమును విశాలమునై యుండెడు మోక్షరాజ్యములో నుండెడు నేలయును, దానిని జుట్టుకొనియుండెడు పరమండలమును నెప్పటికిని మహాలంకార శోభన ప్రభావములతో నిండినదియు, రత్న దీపములచే వెలిగింపబడినదియు, ఘన సుగంధ పరిమళముల గాడ్పుల పరిమళించునదియు, సకల భాగ్యములు సమృద్ధిగాగలదియు, సన్మనస్కులు పాడెడు నత్యంతానంద వినోద సంగీత రాగములతో పిక్కటిల్లునదియు. ఆద్యంతములులేని జ్యోతిర్మహిమగల పరమకర్తను ముఖాముఖిగా నిత్యము దర్శించి యతిస మట్టులేని ఘన ప్రసన్నత యను మహా భాగ్యనిలయమయినదియునై మోక్షరాజ్యము విలసిల్లునని చెప్పబడుచున్నది.

ఇదిగో బుద్ధికందని దూరభారౌన్నత్య విశాలములు కలిగి యత్యంత నిత్యానంద నిలయమైన పరమరాజ్యములో సంచరించు మోక్షవాసులు లఘిమ యను వరము కలిగి క్షణములో నెక్కడికైనను వచ్చుచు పోవుచుందురు, ఈ లోకములో పరమకర్తయొక్క కల్పనల నతిక్రమింప సత్యమార్గమున నడచిన పుణ్యాత్ముల యాత్మలు శరీరమును విడిచి యెడబాసినతోడనే క్షణములో మోక్షరాజ్యము చేరును. లోక ముగింపున మోక్షములో నుండెడు ముక్తులు ఈ లోకములో మునుపు దాల్చికొని యుండిన శరీరము ధరించి ఆత్మ శరీరములతో పునర్జీవితు లగుదురు. అప్పుడు వారలెత్తిన శరీరము పరమభాగ్యము నొందిన యాత్మతో చేరినమాత్రముననే యా యాత్మకుగల నాలుగు వరముల దానను పొందును. అందువలన నా శరీరమున

కొన్నటికిని క్షయము లేకయును, కష్టము లేకయు కడ లేకయు ప్రకాశశో
భనములతో సూర్యునివలె ప్రకాశించుచుండును. అక్షయము లఘు
త్వము సూక్ష్మత్వము ప్రకాశము అను నాలుగు వరములను పొంది
యుండునని యెరుగవలెను. ఇట్టి నాలుగు దొడ్డ వరములచే వెలుగు
మోక్షవాసులు నిత్యకాలము మోక్షరాజ్యములో మహా సుఖముగా
నుండెదరు.

ఇటువంటి దండి మేలులు నిండియుండెడు మోక్షరాజ్యములో వా
సమైయుండెడు భాగ్యశాలురయొక్క ప్రభావంత శోభనాలంకారము
లను, శౌర్యబలపరాక్రమములను. రత్నఖచితమైన రాజోచిత భద్రా
సనములందు కూర్చుండుటయు, కొదవలేని దివ్య సుఖము లనుభవిం
చు భాగ్యమును, రమ్యమైన సుకృతాలంకారములను, సర్వశాస్త్రి
జ్ఞానమహిమను, మరణపిశాచి నభయమును, అన్ని మేలుల పెంపు
పొంది సతతకాలము మహా రాజులై యానందించుటను వర్ణించి చెప్ప
సాధ్యము కాదు. మితిలేని యానందముతో కరుణాసముద్రుడై యుం
డెడు దేవుని దర్శనము నిత్యము చూచుకొను మోక్షవాసులకు కలిగి
యుండునని మహా భాగ్యమును మాటచే వివరించి చెప్పువార లెవరు?
మట్టులేని పరంజ్యోతియైన సృష్టికర్తయొక్క దివ్యమంగళ దర్శనము
పొందుటచేత, మోక్షవాసు లెంత యానందించి యుబ్బునది యెంత
యోచించినను మన బుద్ధి కందునదికాదు. వేదశాస్త్రిపండితులు నా
నా యుపమానములచే దెలిపెడు ప్రకారము మోక్షానంద మేమన:
లోకములోగల సమస్త పుష్పముల రూపలావణ్య పరిమళములను,
రత్న దీపముల ప్రకాశమును, అపరంజి బంగారు మిణుకు తళుకులను,
సూర్యచంద్రనక్షత్ర ప్రభాశోభనములను ఒక్కటిగా జేర్చిన, నేర్పడు
నద్భుత రూపలావణ్య సౌందర్య ప్రభాశోభనమునుకూడ మోక్షరా
జ్యప్రకాశము మించియుండును. ఇదిగో ఆశోభనమంతయు మోక్ష
రాజ్యముయొక్క చిన్న దీపపుకాంతి శోభనమునకు సరిపోల్చిన, సూ
ర్యుని ముందు బొగ్గు నుంచినలాగున నుండుననిరి. అటువంటి రూపలా
వణ్య సౌందర్య శోభనప్రభలు నిండిన యనంత సర్వేశ్వరుని దర్శన

భాగ్యముయొక్క మాధుర్యమును క్షణము సేపుమాత్రము అనుభవించుటకు నాకు అబ్బునేని, నరకముయొక్క కఠోర బాధలన్ని లోకము ముగియుపర్యంతము మంచి మనస్సుతో సహించి యుందునని పిశాచి యొక ఋషీశ్వరునితో పల్కెనట.

క్రీస్తువుడా, పరమకర్తయొక్క యానంద దర్శనమును క్షణంత సేపుమాత్రము అనుభవించుటకు దుర్గంధ నరకముయొక్క కఠోర బాధలన్నియు లోకము ముగిసెడుపర్యంతము అనుభవింతునని పిశాచి చెప్పినయెడల, మట్టులేని యానందమునకు పుట్టువైన సర్వేశ్వరుని సందర్శనమును సదాకాలము అనుభవించుటకు నీవు ఈ లోక నిష్ఠుర బాధలన్నియు మంచి మనస్సుతో సహించి యుండవలెనుగదా. పాతకుడా. మట్టులేని యట్టి దివ్య దర్శనము గొంచెమని పాపము వర్జింపనించుకైన ప్రయాసపడకున్నావు. మనోవాక్కుల కందని యా పరమానందభాగ్యము నాకెందుకు అనినట్లు ఉండి, సత్యవేదమును చేకొనకయు, వేదకల్పవల ననుసరింపకయు నిర్భయముగా నున్నావు. ప్రయాసపడకయే నిత్యభాగ్యము పొందెదనని పిశాచియొక్క బుద్ధిని విడిచి, కలుగు శోధనలను త్రోసివేసి సుకృతిమార్గమున నడువుము.

ఇదిగో నీకూరడింపుగా నొక విశేషము చెప్పెదను వినుము. వేయి సంవత్సరములు పరమకర్తయొక్క సముఖములో నున్నను, నిన్న బోయిన దివసమువలెనే యుండునని వేదోదాహరణములు చదివిన యొక మహా ఋషి చింతించిన దేమన: వెయ్యేండ్లు పెక్కు నాళ్లయి యున్నవికదా. ఇన్నాళ్లు కర్తయొక్క దృష్టిలో నొక గడియ కాలముగానైనను తోచక, నిన్న బోయిన దినమువలెనే యుండుట యెట్లో అనుకొనుచు చంచలపడుచుండగా, పాలవర్ణముగల యొక సుందరమైన పక్షి మెల్లమెల్లగా రెక్కలు కొట్టుకొని యెగురుచు నా ఋషి సమీపమునకు వచ్చి ఇంపుగ పాడెను. అప్పుడా ఋషి పక్షియొక్క యింపయిన రాగము విని మహా సంతోషపడి దానిని పట్టుకొందమని దగ్గర చేరెను. గాని యది చిక్కక మెల్లమెల్లగా నెగురుచు నా ఋషి తన్ను వెంబడించి వచ్చునట్లు చేసి ఆ మఠము సమీపము విడిచి యొక

తోపునకు బోయి మానిపై గూర్చుండి కొంచెము సేపు ఇంపయిన రాగము పాడినందున, ముని పరవశుడై మైమరచి నిలుచుండ నది యెగిరి పారిపోయెను. అప్పుడు ఆ ఋషీశ్వరుడు ఆనందపరవశతనుండి బుద్ధి తెలిసి మహా ఆయాసముతో సంగలార్చి: ఓ పక్షోత్తమా, నా చేతి పట్టుబడక పోయినను, నింక కొంచెము సేపయిన నిలిచి పాడక పోతివా? ఇంతసేపు పాడినట్లు లింకను కాసంతసేపు మా కూరడింపుగా పాడక మమ్ము దుఃఖసముద్రములో విడిచిపోతివో యనుచు తిరుగ తన మఠమునకు పోతలంచెను. అప్పుడు వచ్చిన బాట మారుపడియున్నందున దిక్కు దెస కనిపెట్టజాలక తత్తరపడి నిలిచి యే పార్శ్వమునందు మఠము కానవచ్చునో యని మార్గము వెదకుకొనుచు కడకు మఠము చేరెను, గాని మఠము ముందుండిన ప్రకార ముండక యుందులో నుండిన వారలు తను కాలములో నుండిన వారలు కారని చూచి మహాశ్చర్యపడి, పైన చెప్పిన యా యద్భుతమైన పక్షి వర్తమానమును అక్కడ నున్న వారలకు దెలిపెను. వారలు విని పేరును, వాడు చెప్పిన గడియ లెక్కను దినమును దెలిసికొని, పూర్వకాలపు పుస్తకముల నెత్తి చదివి, వీని పేరును సంవత్సరమును కనిపెట్టి, వీడు మఠము విడిచిపోయిన వాడే యని కనుకొని, మున్నూరు సంవత్సరములుగా నా తోపులో పాడుచుండిన పక్షియొక్క రాగములను వినుచుండెనని తెలిసికొనిరి.

పాఠకుడా, ఒక సన్మనస్కుడు పక్షిరూపముగా ఋషికి కనబడి పాడిన యింపయిన పాటను మున్నూరు సంవత్సరములు వినినను, రవంతసేపు వినినట్లు లా ఋషికి తోచెను కదా. మోక్షరాజ్యమందలి యనంత కాలము సన్మనస్కులు పాడెడు మహా సుందర గానములను అన్ని మేలుల స్వరూపియై యుండెడు సర్వేశ్వరుని ప్రత్యక్షముగాను ముఖాముఖిగాను దర్శించుటలో వచ్చెడి పరమానందము ననుభవించుచుండెడు మోక్షవాసులయొక్క మనోవాక్కుల కందని మహా భాగ్యమును కొంచెము యోచించి, నీ పాపమార్గములను విడువవా? ఇటువంటి యశ్రద్ధను విడిచి పరమపదవిని పొంద ధర్మమార్గములో

నడువుము; ఎందుకనగ దివ్యగురువైన జేసునాథుండానతిచ్చిన తిరువాక్య మేమనగ: జయము గొనిన వారిని మాతోకూడ భద్రాసనములో గూర్చుండ జేసెదనని వచించెను. లోకము పిశాచి శరీరములను మూడు శత్రువులను సుకృత పుణ్యములచే జయించి సన్మార్గములో నడిచినవారికి మాత్రమే జేసువు నిత్యానందపదవిని ననుగ్రహించును. గాని యీ మూఁగురు శత్రువులను జయింపక పాపమార్గములో నడిచిన వారలను తప్పక నిత్యనరకములో త్రోయును.

ఓరి పాపాత్ముడా, ఇదిగో యీ లోకములో నాలుగునాళ్ల పాప సుఖమును వర్జించి సుకృత మార్గములో తపస్సు చేసిన పిదప బొందనగు పరమపదవిని పొందవచ్చును. అట్లు కాదని మూన్నాళ్ల యశుద్ధ సుఖముల ననుభవించినయెడల, నిత్యకాలము మండెడు నరకములో పడవలయును. కాబట్టి మంచి కాలములోనే నడచు త్రోవను గుర్తించి చూచి మేలైన మార్గమునే పట్టి నడువుము.

## పదునాలుగవ వ్యాసము.

### మనుష్యుని యంత్యగతి.

అంత్యమును చూచుకొని ప్రయాణము చేయవలెనను వేదాగమ వాక్యముచొప్పుననే సముద్రము ఏళ్లన్నిటికి గతి స్థలమైనందున, ఏళ్లన్నియు సముద్రమునుగూర్చి పోవుచున్నవి. భూమి రాతికి గతి స్థలమైనందున, నాకాశమునకు విసరివేసిన రాయి తిరిగి భూమిమీదనే పడును. ఆకాశము అగ్నికి స్థలమైనందున, మండెడు నిప్పుమంట లాకాశమున కెగయుచున్నవి. ఇట్టులివి తమకు గతియైన స్థలమును వెతకి పోవునట్లు, మనమును మన పరమగతియైన మోక్షరాజ్యమును గూర్చి వెదకుచు పోయి దానిని చేరవలెను. ఏళ్లు రాళ్లు మొదలగు బుద్ధిలేని వస్తువులు, బుద్ధిగల మనుష్యులకు తమ గతిని వెతకిపోవలెనని బుద్ధి నేర్పుచున్నవి కదా. బుద్ధిగల మనుష్య లానందపదవియైన మోక్షమును జేరుటకై కలిగింపబడియున్నందున, నొక గడియసేపైన దానిని దలంపక వెతకక యుండరాదు. మనము జీవించు కాలమంత

యీ మన యంత్యస్థానమగు మోక్షము జేర ప్రయాసపడవలెను. మోక్షమును పొందుటకే మనము లోకములో జన్మించియున్నాము. గాని మన కడగతియగు మోక్షము జేరవలెనని కొంచెమైనను మనస్సు పెట్టక, నాలుగు నాళ్లలో నాశమగు ప్రపంచపు సుఖభోగముల నాశించి, వానిమీదనే జ్ఞాపకముంచి యవే తమకు గతి యన్నట్టు వానినే వెదకుచు తిరిగెడువార లనేకు లున్నారు.

ఒక లౌకిక శాస్త్రిజ్ఞుడు దానిని కనిపెట్టినందున, మట్టమధ్యాహ్న వేళ దీపమును వెలిగించి చేత పట్టుకొని యనేక మనుష్యులు చేరియున్న చోటికి పోయి, యింత మందిలో బుద్ధిగల మానవు డెవడని తెలిసికొన వచ్చితిననెను. రాత్రిలో నొక మనుష్యుని వెదకులాడునట్టు వాడు వట్టపగలే దీపము వెలిగించి వెదకినందుకు కారణ మేమనగా: లోకమందలి మనుష్యులలో బుద్ధి న్యాయముచొప్పున నడుచువారలే వెలుగులో నడుచుచున్నారుగాని యితరులంత రంధకారపు చీకటిలో తడమాడుచున్నారు. వెతకవలసిన గతిని వెతకక, వెతకరానివి గతి యని నమ్మి వెతకుటవలన బుద్ధి న్యాయమను దీపపు వెలుగు లేనందున నంధకారములో నున్నారని యా శాస్త్రి చూపించెను. ఈలాగుననే మనుష్యు లీలోకమున స్థిరనివాసవారలై త్రోవ నడచు బాటసారులై యున్నారుగాన తమ యంత్యగతి యేదని యెరిగి, దానిని కనుగొను మార్గము వెతకక, భూలోకమున నెల్లకాలము జీవించుదు మన్నట్టు తమ స్వల్పాయుస్సులో మాయలోకపు సుఖములను నాశించి వెదకెదరు. అందువలన మనుష్యులు తమ యిల్లగు పరమపదము జేరక త్రోవ తప్పి మోసపోవుచున్నారు.

ఇట్లు మోసములో చిక్కకుండకదా యనేకులు ద్రవ్యవంతులు, తమ ద్రవ్యములు పరమపదవి చేర నాటంకములుగా నున్నవని తెలిసికొని ద్రవ్యములను వర్జించి బీదలకు నిచ్చి మరణపర్యంతము పరదేశులుగా సంచరించుటయు, అనేకులు లోక బహుమాన గౌరవ ప్రతాపములు పరలోకము జేర విఘ్నముగా నున్నవని కని మాయలోక గౌరవములను త్యజించి దరిద్రులుగా నడుచుటయు, లోకపు సుఖభో

గములు మోక్షము చేర నభ్యంతరముగా నున్నవని యెరిగి యనేకు
లు వాని నసహ్యించి రోసి వనములలో దాగుకొనుటయు సంభవించె
నని యర్చ్యశిష్టుల చరిత్రములలో చదివి తెలిసికొనవచ్చును. అందుకు
సాదృశ్యముగా నొకటి రెండు విశేషములను వివరించెదను వినుము.

యౌవనప్రాయమున రూపలావణ్య సౌందర్యములతో నొప్పు నొ
కడు తన ముఖలావణ్యము తనకు పాపకారణముగా నున్నదని భయ
పడి సొంపైన తన ముఖమును విపరీతము చేసికొని శరీరసౌందర్యము
చూపకుండ వంటవని చేసికొని పాపము లేక మరణపర్యంతము ధర్మపు
త్రోవలో నడిచెను. ఈలాగుననే యింకొకడు దొడ్డ జ్ఞాని యని పే
రొందినందున, లోకులు తన్ను గౌరవించి సన్మానింతురని భయపడి
పిచ్చివాని వేషమెత్తి లోకమును వర్జించి పరలోకము జేర పుణ్యము
లాచరించుచుండెను. ఈలాగుననే రాజులై యుండిన యనేకులు రా
జ్యపరిపాలనములో ప్రపంచపు చింతలేకాని పరమపదవి పొందు మా
ర్గము లేదని తెలిసికొని రాజ్యమును విడిచి సన్న్యాసము బట్టి పుణ్య
మార్గ మవలంబించి నిత్యానంద మోక్షరాజ్యము చేరిరి. ఇదియంత
యు పరమపదమును పొందుటకే చేసిరిగాని మరియొకదానికి గాదు.
ఎవడైననేమి తన కర్తవ్యమైన పరలోకమును చేర నాశించునెడల పా
పములకు కారణముగా నుండెడు లోకసుఖములను విడిచి పుణ్యముల
ను వెదకును. అట్లు చేయకపోయిన పరలోకము జేరక నరకములో
పడుట తప్పదు. ఈ దొడ్డ కార్యమునుగూర్చి నీకు మరికొన్ని సుబుద్ధు
లు చెప్పుచున్నాము, వినుము.

చిత్రకారుడు చెక్కు త్రోవకు పట్టెడి కొయ్యను ఫలాని చిత్రము
నకని తలంచి చేయక యూరక చెక్కుచు పోవుచుండినట్టయిన, వాడు
పడిన ప్రయాసచే పొయ్యికి కట్టెలు చెక్కినట్టగునుగాని యింకేమి
ప్రయోజనముండదు. ఈలాగుననే ప్రయాణము చేయువాడు బయలు
దేరక ముందర ఫలాని యూరికి పోవలెనని గుర్తించుకొనక పోయిన
మొదల, నడిచెడు ప్రయాసమున కూరట యెక్కడ నుండును? దిక్కు
తెలియక పిచ్చివాని చందమున తిరుగునుగదా! ఇటు చేపట్టిన కార్య

మున కొక యుద్దేశములేక యంత్యగతిని తలంపక చేసినట్టయిన, నా కార్యము వ్యర్థమై పోవును. కాన బుద్ధిగల మనుష్యుడే దేని యొక్క తాత్పర్యములేక నడువ పూనుకొనరాదు. ప్రతివాడు తాను లోకమందు చేయు క్రియలను తన యాదేర్పునకుగాను చేసినట్టయిన, పడిన ప్రయాసకు ఫలము కలుగునుగాని ప్రపంచ సుఖభోగములనుగూర్చి చేసినయెడల తన పరమపదవిని చేరక నరకములోనికి తన యాత్మను పడద్రోయుచున్నాడు.

నరకపాతమునకు భయపడనివానికి నిత్యసద్గురువు వచించిన సద్బుద్ధి యేమనగ: లోకమంతయు మనుష్యుడు పొందుటవలన అతని యాత్మకు నష్టము వచ్చునేని వానికి లాభమేమనెను! ఈ వేదవాక్యము చొప్పున లౌకిక మాయాసుఖములను వెతకుటలోను ననుభవించుటలోను పాపమే వచ్చుచున్నదిగాని పుణ్యము రాదని బుద్ధిగలవాడు గ్రహించి నరకమున పడకుండ లోకసుఖములను వర్జించి పరలోకము చేర ధర్మమార్గములో నడుచుకొనును. లోకమును దాని సంపదలను నమ్ముటచే నాత్మకు నష్టమని తెలుప పరమకర్త చెప్పిన దేమనగ: సూదిబెజ్జములో నొక యొంటెయైన దూరవచ్చునుగాని ధనవంతుడు మోక్షరాజ్యము చేరుట దుర్లభమనెను. పాపాత్ముడా! పరమకర్త వచించిన వాక్యము తప్పునా? తప్పదుగదా. అట్లయిన లోకముయొక్క మాయ సుఖభోగములను వదలను తెగువ నీకేల? కాలముండగనే మంచిబుద్ధి ప్రకారము పరలోకము పొందు పుణ్యములు చేసి సత్యవేదము ప్రకారము వర్తింపుము.

మేడికర్ర పట్టుకొని వెనుక చూచువాడు మోక్షరాజ్యమున కర్హుడుకాడని దివ్యకర్త మంతలించియున్నాడు. ఇందులకు నర్థమేమనగ: దున్నువాడు చేతపట్టిన మేడిని దున్నడు భూమిని చూచుకొని పోయినయెడల, పని సఫలమగునుగాని వెనుక చూచుచు పోయినయెడల చేపట్టిన పని కొనసాగదు. అట్లు లోకమున జన్మించిన మనుష్యుడును కొన్నాళ్లు పుణ్యము చేసి కష్టపడి మోక్షరాజ్యము చేరవలసియుండగా, పుణ్యము చేయ ప్రయాసపడక, మాయసుఖములను వెతికనె

డల నాత్మకే చేటు కలుగును. లోకమున పడిన ప్రయాసయంతయు వ్యర్థమగును. తుదకు నరకమున బడును. ఓరీ పాపాత్మా! నీ విల్లు పడకుండ నీ గతియైన పరమకర్తయొక్క యానందరాజ్యము నెల్లప్పటికిని తృష్టించుచు, నందు చేరవలెనని ధైర్యముతో సుకృతపుణ్యములు చేయుము.

అయ్యయ్యో పాపీ! పొర్లి పారెడు నీళ్లు, నెగసి మండెడు నిప్పు, నాకాశమునుండి క్రిందబడు రాయియును మధ్యమున నిలువక, నీళ్లు సముద్రమును, మండెడు నిప్పు ఆకాశమును, విసరిన రాయి భూమిని చూచుచు బోవును. ఆకాశమున విసరినరాయి తాను రాళ్లలోపడిన పగిలిపోవుననియు, ముండ్లలోను బురదలోను పడిన నందులో గుచ్చుకొని మునిగిపోవుననియు, నాకాశమందే నిలుచునా? లేదుకదా. ఎక్కడ పడిన నేమి? తన స్థలమును గతియునైన భూమిమీద పడిన చాలునని తక్షణమే భూమిమీద పడుచున్నదిగదా. ఈలాగుననే సకల వస్తువులు తమ యాశ్రయ గతి స్థలములను చూచి పోవుచుండును.

అయ్యో! మతి చెడినవాడా, నిన్ను సృష్టించినవాడును, సర్వశక్తుడునయిన పరమకర్తయే నీకు గతియు నంత్యస్థలమునై యున్నాడు. అతని ప్రత్యక్షదర్శనము చేసిననేగాని నీ యాశలు తీరవు. కాబట్టి నీకు గతియైన యేక దేవుని నారాధింపకయు, అతనిని చూడవలెననెడి గాఢాభిలాషతో మోక్షరాజ్యముకొరకు చూచుకొనుచు ప్రయాణము చేసి, సుకృతమార్గములో పరుగెత్తకయు దామసించుటేల? పాపీ! నీ కడగతిని పొందుటకై దుఃఖదురితములను, వ్యాధికష్టములను, నిందావమానములను పడవలసియుండగా, వానికి భయపడి, నిన్ను కలిగించిన దేవునికి లోబడక ద్రోహము చేయుటేమి? నీవు నైకొన్న సత్యవేదమును వదలుటకన్న కష్టబాధలతో జీవించుచున్నను, చచ్చినను కాదువ లేదనుకొనుచు విశ్వాసములోను పుణ్యములోను పట్టు వదలకుండుము. ప్రామాణికముగా నుండెడు వారలకేకదా మోక్షరాజ్యమబ్బును! అందువలన నీ పరమగతియైన దేవుని వెతకిపోవలసినదితప్ప దుర్నతములను, లోకాశాపాశములను, పాపచర్యలను వదలుటలేదని

పాతము సాధించినయెడల నీకు తప్పక మహా భయంకరమైన నరకమే సిద్ధించునని యెరుగవలయును.

కాని మోక్షరాజ్యము చేరుటకు గావలసిన పుణ్యముల నే నెరుగ నందువేమో? అట్లయిన కొన్ని సుబుద్ధులు చెప్పెదము. వినుము: 1. నిన్ను కలిగించిన ఏకకర్తయగు దేవుడొకడు కలడనియు, అతడు కరుణించిన సత్యవేదములో మాత్రమే పరమగతి లభించునుగాని, మనుష్యులు కల్పించిన యితర మతములలో చిక్కదనియు నీవు విశ్వసింపవలెను. 2. పరమగతి చేర మనస్సుపెట్టి పాపములను వర్జించి సత్యవేద కల్పనల ననుసరించి పుణ్యములను చేయుచు జీవించినట్లయిన పరమగతి పొందవచ్చుననుగట్టి నమ్మకముతో నుండవలెను. 3. నిన్ను సృష్టించిన ఏక దేవుని సకల వస్తువులకన్న నధికముగా నిండు మనస్సుతో స్నేహింపవలెను. ఇవియుగాక విమర్శ, నీతి, ధైర్యము, తపస్సు అను నీ నాలుగు సుగుణములను పై చెప్పిన మూడు దైవీకపుణ్యములతో నీ హృదయమునందు స్థిరముగా నుంచుకొనియుండుము. లేనట్లయిన నీ గతియగు మోక్షము చేరక నరకమున నిత్యకాలము బాధలు పడుట తప్పదు. ఓ పాతకుడా! శీఘ్రముగా సకల కఠోర పాపములను త్యజించి, నిర్మల హృదయుండవై చేయవలసిన పుణ్యములను చేసి, సన్మార్గమందు ప్రవర్తించి మోక్షము చేరుటకు ప్రయాసపడుదువుగాక.

సమాప్తము.

# విషయసూచిక.



